Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

పశువుల కూడు

పంపినవారు :
ఎ. ఐ. కొండారెడ్డి - రాయపే

## ఈ సంచికలో కథలు
## వింతలు - విశేషాలు







ఇవిగాక రంగులబొమ్మకథ - బైపు చిత్రాలు - నలుమూలల నడకలు - ఫోటోశీర్షికల పోటీ - మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు

# హిందీ చందమామ దీపావళి సంచిక



మామూలుకంటె ఎక్కువ పేజీలతో, ఎక్కువ రేఖా చిత్రాలతో, త్రివర్ణ చిత్రాలతో—చక్కటి కథలు, మనోహరమైన గేయాలు, గిలిగింతలు పెట్టే చిక్కు సమస్యలు, ఇంకా అనేకమైన అందచందాలతో, ముచ్చటయిన త్రివర్ణ ముఖచిత్రంతో

## హిందీ చందమామ
నవంబరు సంచిక దీపావళికి



వెలువడబోతున్నది. ఇన్ని ఆకర్షణలతోకూడిన ఈ ప్రత్యేక సంచిక వెల

## మామూలు 6 అణాలే



మీ కాపీకోసం ఇప్పుడే మీ ఊరి ఏజంటుతో చెప్పి వుంచండి.

---

చందమామ పబ్లికేషన్సు
వడపళని :: మదరాసు-26.

నవ వికసిత పుష్పం వలె
తాజాగా, మనోహరంగా
ఉండండి...

# హమాం

టాయిలెట్ సబ్బును
వాడుడు




హమాం క్రొత్త సువాసన
కలది...మరియు ఎక్కువ
కాలం మన్నును కూడా!

ది టాటా ఆయిల్ మిల్స్
కంపెనీ లిమిటెడ్




టాటా తయారు

TS 6129

**PHONE: 31** **GRAMS: PUBLISHERS**




## మీడియమ్ డిక్షనరీ

## Balasaraswathi Pictorial Medium Dictionary

**ENGLISH - ENGLISH : TELUGU**

with English Synonyms, Antonyms, Definitions and Illustrations together with an Encyclopedia for Students

విద్యార్థులారా!

మా డిక్షనరీ విద్యార్థులకు-విజ్ఞానవేత్తలకు నిత్యం వాడు చేసే విద్యా వ్యాసంగంలో ఎంతో ఉపయోగపడుతోంది. వేనకువేలు దీనివల్ల నేడు లాభపడుతున్నారు. విజ్ఞానం కావాలని, ఆంగ్లభాషలో పరిశ్రమ చేయాలని అనుకొనేవారందరికి చేదోడు వాదోడుగా వుండి, మీకా భాషలో శక్తిసామర్థ్యాలు తక్కువగావున్న లోపాన్ని తీర్చగలదు. ఇందులో మీకు అవసరమైనట్టి పదాలన్నింటిని కూర్చి సరిక్రొత్త పద్ధతిలో (English to English and Telugu and English synosmny, Antonyms, Definitions and Illustrations together with an Encyclopedia for students) చేర్చి అందము చందము లొలికేట్లుగా ముద్రించినాము. విద్యకు - విజ్ఞానానికి పరీక్షలో విజయానికి మీకు ఈ డిక్షనరీ ఎంతైనా తోడ్పడగలదని హామీయిస్తున్నాము. పూర్తి క్యాలికోబైండు మీడియం డిక్షనరీ ధర రు. 9-0-0. జెం డిక్షనరీ ధర రు. 4-8-0. తక్కువ వెల! ఎక్కువ విలువ!! అవకాశాన్ని జారవిడుచుకోకుండా జాగ్రత్తపడాలని మిమ్మల్ని ప్రత్యేకంగా కోరుతున్నాము.

బాలసరస్వతీ బుక్ డిపో, పోస్టు బాక్సు నెం. 3 కర్నూలు & మద్రాసు 1.

వావిళ్ళ రామస్వామి శాస్త్రులు & సన్స్, మద్రాసు-1 వారివద్దకూడా దొరుకును.

---

# రావల్‌గాన్





గ్లూకోజు, మంచి పాలు, చక్కెర—వీటితో తయారై, చేతితో తాకబడక, యంత్ర సహాయంవలన ప్యాకింగ్ కాబడినవి.

"రావల్‌గాన్" మిఠాయిలూ, టాఫీలూ గత పది సంవత్సరాలుగా ప్రసిద్ధిచెందినవి.

ఉచిత బహుమతుల కేటలాగ్‌కోసం వ్రాయండి

నేమిచంద్ పారస్‌మల్ అండ్ కో.,
128 - ఎ, నైనియప్పనాయక్ వీధి.
మదరాసు - 3

## 'చందమామ' కు ఏజంట్లు కావాలి

★

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలుకూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తివివరాలకు వ్రాయండి.

**చందమామ ఆఫీసు**
వడపళని, మద్రాసు - 26



## చందాదారులకు మనవి

★

పైనెల చందమామ యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లైంట్లు, గత నెలలో చేరలేదనే కంప్లైంట్లు గమనించబడవు.

మేనేజరు

# చందమామ

సంచాలకుడు : చక్రపాణి

ప్రపంచమంతటినీ టకటకలాడించినటువంటి మేటి శ్రీ వివేకానందస్వామి. ఆయున గాఢమైన రామభక్తుడు. ఆయునను శ్రీరామచంద్రమూర్తి ఏవిధంగా రక్షించాడో ఈ సంచికలోని 'మిఠాయివర్తకుడు' అనే కథ వ్యక్తంచేస్తుంది. పోతే, వివేకానందుని జీవితంలో ఇటువంటి వింత సంఘటనలు ఇంకా ఎన్నో వున్నై. ఒకప్పుడు స్వామి అరణ్యాలలో విశ్రాంతి తీసుకొందామని ఒక చెట్టు కింద కూర్చున్నాడు. భయంకరమైన ఒక పెద్దపులి వచ్చి, స్వామి ఎదుటనే కొద్ది గజాలదూరంలో కూర్చున్నది. స్వామి చెక్కుచెదరలేదు. కూర్చున్న పులి ఏమనుకొన్నదో కాని, మరి కొంచెంసేపటిలోనే దాని దారిని అది వెళ్ళిపోయింది. స్వామి ఆశ్చర్యపోయాడు.

సంపుటి 13 : అక్టోబర్ 1953 : సంచిక 4





# మూషిక సుభాషితం

ఒక గజేంద్రుడూ, ఒక ఖడ్గమృగం,
'నే గొప్పంటే నేనే గొప్ప'ని
అడవుల నేలే హక్కులకోసం
ద్వంద్వయుద్ధమున తారసిల్లగా

కొక్కొ అంటూ కూతను కూసి
నక్కబావ ఆ నడుమను వచ్చి
"శ్రీ గణేశ్వరుని చిట్టివాహనం
గగనవీథిలో వేంచేసె" ననె.

పైకి చూడగా కననయ్యెనుగా;
తోకను తెల్లని జెండా యెగురగ
దివ్యమైన గద చేత ధరించి
భువికి దిగే విఘ్నేశుని ఎలుక.

"ఏనుగు తలగల దేవుడౌట తన
ఘనతను నిల్పగ దూతను పంపెను.
శరించినందుకు శాస్తిజరుగు నీ
మృగాధమున" కని ఏనుగు మురిసె.

ముచ్చటగా ఆ మూషిక పుచటికి
వచ్చినదైనా వచ్చినటులనే
ఎచ్చటికో మరి కడు ఆత్రముగా
ముచ్చెమటలతో పోసాగినది.

( గేయకథ )

అది గని ఏనుగె నేరు చేసుకొని
"ఇదేమిటయ్యా! ఎలుకస్వామి!
ఈ యుద్ధం విని మా గజాననుడు
నా యండగ నిను పంపలేదె" యనె.

చిత్ర వినాయకు చిట్టెలు కప్పుడు
వెనుకతిరిగి "నే వినలే దెప్పుడు
మీర లెవ్వరో మీ తగవేమో
దేవులదాకా రానేలే" దన

"గొప్ప జంతువుల గొప్ప యుద్ధ మీ
గొప్ప వార్తనే వినలేదంటే
ఇప్పు డెందులకు తమ రా" కంటూ
దెప్పిపొడిచె నా యెలుకను ఏనుగు.

"గడ్డిపోచకై చీమల దండుకు
వచ్చిన పోరును స్వర్గంలో విని
సద్ది రమ్మనుచు శ్రీగణనాథుడు
పంపగ వస్తిని పని వినియెద" నని

ముసిముసి నవ్వుచు విసిరిపోయె నా
మూషిక మొక్క సుభాషితము.
"కొద్ది గొప్పలని భేదము కలుగదు
దేవుని సన్నిధి నందరు సమ" మని.



# అట్టమీది బొమ్మ

త్రనను పరాభవించిన ద్రోణుణ్ణి సాధించేటందుకుకదా, పాంచాలప్రభువైన ద్రుపదమహారాజు ఘోరతపస్సుచేసి ద్రౌపదిని కుమార్తెగా పొందాడు? ద్రోణుని ప్రియశిష్యుడైన అర్జునుడు, తక్కిన పాండవులతోపాటు లాక్షాగృహంలో దహనమైవుంటాడని నమ్మి, నలుగురలాగానే ద్రుపదుడూ విచారించాడు.

ద్రౌపదికి యుక్తవయస్సు వచ్చింది. పార్థునివంటి ప్రజ్ఞావంతుడికి ఆమెనిచ్చి పెండ్లిచేయాలనే కుతూహలంతో, ద్రుపదుడు ఒక గొప్ప పరీక్ష పెట్టాడు. అదే 'మత్స్యయంత్రం'. ఎంతో యెత్తున మత్స్యయంత్రం ఏర్పాటు చేసి, కింద బరువైన విల్లొకటి పెట్టాడు. విల్లు ఎక్కుపెట్టి ఎవరు ఆ మత్స్య యంత్రాన్ని ఛేదిస్తే, వాళ్లకు తన కుమార్తెను ఇస్తానని రాజ్యంలో స్వయంవరం ప్రకటించాడు.

స్వయంవరానికి రాజాధిరాజులందరూ వచ్చారు. కర్ణ, దుర్యోధనాదులు వచ్చారు. బ్రాహ్మణుల రూపంలో పంచపాండవులూ వచ్చారు. దర్బారు కిటకిటలాడుతూ, అత్యంత వైభవంగా ఉన్నది.

ద్రౌపదికి సోదరుడైన దృష్టద్యుమ్నుడు స్వయంవరాన్నిగురించి వివరాలన్నీ సభవారికి వెల్లడించాడు. వివరాలు విన్నతరువాత ఆ వచ్చిన రాజకుమారులలో కొందరు కూర్చున్నచోటినుండి లేవనేలేదు. కొందరు సగందూరం వచ్చి అక్కడి నించే తలవంచుకు మరలిపోయారు. కొంతమంది ధనుస్సు ఎత్తబోయి, చేతగాక వెనుదిరిగారు. చివరకు, బాణం ఎక్కుపెట్టి కొట్టగలిగింది ఒక్కడే ఒక్కడు—కర్ణుడు. ఐతే అతని గురి తప్పిపోయింది. ఇక క్షత్రియులలో పోటీ చేయవలసిన వారెవ్వరూ మిగలలేదు. అప్పుడు ద్రుపదుడు, బ్రాహ్మలలోనైనా సరే సమర్థత కలవారు పోటీచేయవచ్చు నన్నాడు.

వెంటనే, బ్రాహ్మణరూపంతో వున్న అర్జునుడు ఉత్సాహంతో ముందుకు వచ్చాడు. గురిపెట్టి కొట్టి మత్స్యయంత్రాన్ని ఛేదించాడు! సభలో జేజేలు మిన్నుముట్టినై.

ఈ యంత్రాన్ని కొట్టింది బ్రాహ్మణుడు కాదు, ఫల్గుణుడే అనేరహస్యం వెల్లడికాగా, సభలో చెలరేగిన ఆనందానికి అంతు లేకపోయింది. ద్రౌపది సరాసరి వచ్చి పూలమాలను సవ్యసాచి మెడలో వేసింది !!



# పంచకల్యాణి

బ్రహ్మదత్తుడు కాశీనగరాన్ని పరిపాలించే కాలంలో ఒకప్పుడు, బోధిసత్వుడు ఉత్తమజాతి అశ్వంగా జన్మించాడు. అది రాజుగారి గుర్రాలలోకెల్లా ప్రధానమైన పంచకల్యాణిగా ఎంచబడుతూ వుండేది. అందుచేత దాని పోషణ, అలంకరణ, ప్రత్యేకించి రాజఠీవి ఉట్టిపడేటట్టు జరుపుతూవచ్చారు.

రాజుగారి గుర్రాలలో ముఖ్యమైన ఆ పంచకల్యాణికి మూడేళ్ళనాటి ప్రశస్తమైన పాతధాన్యాలతో ఆహారం తయారుచేసి పెట్టేవారు. దాని ఆహారం మామూలు అన్ని గుర్రాలకు మోస్తరుగా కాక, వేయి మొహిరీలు ఖరీదుచేసే ఒక బంగారు పళ్ళెంలో పెట్టేవారు. అది మసిలే శాల గుమగుమలాడుతూ పరిమళించేది. ఆ శాల చుట్టూతా ఆకర్షణీయమైన తెరలు వేలాడుతూ వుండేవి. పైన బంగారుపువ్వులు చమికీ వేసిన అందాలచాందిని కట్టబడివున్నది. నాలుగుగోడలకూ సువాసనలు విరజిమ్మే రకరకాల పుష్పజాతులు అమర్చబడివున్నాయి. రాత్రింబగళ్ళు ఆ శాల అగరు వత్తుల ధూపంతో, సుగంధద్రవ్యాల పరిమళాలతో, వెలిగిపోతూవుండేది.

ఇటువంటి ఉత్తమమైన అశ్వం గల కాశీరాజును చూస్తే ఇరుగుపొరుగు సామంత రాజులెవళ్ళకూ అంతగా ఇష్టం వుండేది కాదు. ఒకప్పుడు ఏడుగురు సామంత రాజులు ఒకటిగా చేరి, కాశీరాజుకు ఇలా రాయబారం పంపించారు: 'మీరాజ్యం మాకు పప్పగించినా సరే, లేకుంటే యుద్ధానికి తయారై వచ్చినా సరే" అని.

వెంటనే కాశీరాజు తన మంత్రులను సమావేశపరిచి, సంగతిసందర్భాలు విప్పి





చెప్పాడు. అందుకు మంత్రులు "మహారాజా!—మీరు యుద్ధరంగానికి స్వయంగా వెళ్లపనిలేదు. మన సేనానిఐన వీరవర్మను పంపిస్తే సరి. అతనే జయించుకువస్తాడు. అటువంటివాడే జయించలేకపోయినట్టయితే, తరువాత సంగతి అటుపైన ఆలోచిద్దాం," అని సలహాయిచ్చారు.

అప్పుడు కాశీరాజు సేనానిని పిలిపించి "ఓయీ వీరవర్మా!—మనమీదికి ఇప్పుడు ఏడుగురు సామంతులు ఎదురుతిరిగి రాబోతున్నారు. ఆ ఏడుగురినీ జయించటం నీవల్ల నవుతుందా?" అని అడిగాడు. "మహాప్రభూ!—ఏలికకు ఎంతో ప్రియమైనటువంటి పంచకల్యాణిని దయచేయిస్తిరంటే ఈ ఏడుగురు రాజులనే కాదు, దేశమంతటినీ ఒక్కదెబ్బతో జయించుకురాగలను" అని ధీమాగా పలికాడు వీరవర్మ. అందుకు రాజు సంతోషంతో సమ్మతిస్తూ, తన పంచకల్యాణిని తీసుకువెళ్ళి యుద్ధం జయించుకురమ్మని సేనానిని పంపాడు.

రాజువద్ద సెలవుతీసుకొన్న సేనాని, వెంటనే పంచకల్యాణిని తీసుకొని, యుద్ధానికి సిద్ధమైనాడు.

వీరవర్మ మెరపులాగా కోటనుండి ఇవతల పడ్డాడు. ధైర్యసాహసాలతో పోరాడి, మొదటి సామంతుని పట్టి, బందీగా తీసుకొన్నాడు. మళ్ళీ యుద్ధరంగానికి వచ్చి, రెండవ సామంతునీ, మూడవ సామంతునీ, అలాగే వరసగా ఐదుగురు రాజులనూ బందీలుగా చేసుకొన్నాడు.

ఇంతవరకు జయించుకువచ్చిన వీరవర్మ ఆరవ మకామునకు చేరుకుని ఆ రాజుతో తలపడి జయించేటంతలో అతని గుర్రానికి దెబ్బతగిలి, నెత్తురు బలబలమని ప్రవహింపసాగింది.

వీరవర్మ పంచకల్యాణిని ఒక ద్వారం వద్ద కట్టివేసి, మరొక గుర్రాన్ని తీసుకొని యుద్ధానికి వెళదామని ఆలోచించాడు. ఈ





ఆలోచనతో, పంచకల్యాణికి వున్న జీనూ, కళ్లెమూ తక్కిన సామగ్రీ విప్పివేయబోయాడు.

అప్పుడు పంచకల్యాణిరూపంతో వున్న బోధిసత్వుడు సేనాని చేస్తున్న పనిని కళ్ళు విప్పిచూచాడు. "అయ్యో! వీరుడా!— ఎంత అమాయకుడవు! నాకు దెబ్బ తగిలిందనగానే మరివొక గుర్రాన్ని తయారు చేసుకుందా మనుకుంటున్నావు. ఏడవ మకాము భేదించి, ఏడవ సామంతరాజును పట్టి ఇవ్వడం ఆ గుర్రానికేమి చేతనవుతుంది?— అలా నమ్మి, కొత్తగుర్రాన్ని తీసుకోవటంతో ఇంతవరకు నేనుచేసిన పనిఅంతా వ్యర్థం ఐపోతుందే. పైగా, నువ్వు నిష్కారణంగా శత్రుచేతులలో పడి చచ్చిపోతావే! మన యజమాని ఐన కాశీరాజు అతిసులువుగా సామంతుల చేతులలో చిక్కుకొనిపోతాడే! ఏడవ మకాము భేదించి, ఏడవ సామంత రాజును జయించటం ఒక్క నావల్లనే అవుతుందిగాని మరొక గుర్రానికి అలవికాదని నీకు తెలియకపాయెకదా!" అని అనుకుని విచారించింది.

అంతతో ఊరుకోలేదు. దెబ్బతగిలి అలా పడిపోయివున్న ఆ పంచకల్యాణి వీర వర్మను దగ్గరకు పిలిచి, ఇలా చెప్పింది:




"ఓయీ, శూరుడా! వీరవర్మా!!— ఏడవమకాము భేదించి ఏడవ శత్రురాజును పట్టగల గుర్రము నేనుతప్ప మరొకటి లేదని తెలుసుకో. ఇంతవరకూ నేను చేసిన పని వ్యర్థం కానీయకు. ఎటువంటి పరిస్థితులలో నైనా ధైర్యం, సాహసం ఉండాలి. ఇందుకు తోడు ఆత్మవిశ్వాసం, గుండెనిబ్బరమూ అవసరమైవుంది. కనుక, నామీద పూర్తి నమ్మకం కలిగివుండు. దెబ్బతగిలినంత మాత్రాన నన్ను విడిచిపుచ్చకు. గాయం తగిలిన నా కాలుకి కట్టుకట్టి బాగుచెయ్యి.

"ఓ సేనానీ!—నేను బాణపుదెబ్బలు తగిలి పడిపోయివున్నప్పటికీ, నన్ను మిం

చిన అశ్వం మరిఒకటి లేదు. నన్ను వదిలి వెయ్యకు. నామీద విశ్వాసముంచి, నా కాలు బాగుచెయ్యి. మళ్ళీ నన్ను పూన్చి, యుద్ధ రంగానికి బయలుదేరు" అని అనేకవిధాల బోధచేసింది.

తక్షణమే వీరవర్మ తన పంచకల్యాణికి కట్టుకట్టి మళ్ళీ తయారుచేశాడు. దానిపైన ఎక్కి బయల్దేరేసరికి, అది మెరపులాగా మెరసి, చూస్తూవుండగా ఏడవ మకాం భేదించింది. వెంటనే వీరవర్మ ఏడవ సామంతునికూడా బందీగా పట్టివేశాడు. వీరవర్మకే యుద్ధంలో విజయం కలిగింది.

బందీలుగా పట్టుబడిన ఏడుగురు సామంతులనూ సైనికులు కాశీరాజు ఎదుట పెట్టారు. పంచకల్యాణి రూపంలో వున్న బోధిసత్వుడూ అక్కడికి వచ్చాడు. వచ్చి, రాజుతో "ప్రభూ!—ఈ ఏడుగురూ నీకు సాటిరాజులు. వారిని హింసించటం తగదు. వారిని లాఘవపరచటంకూడా న్యాయం కాదు. నీకు తోచిన ఒక షరతు పెట్టి, వారిని ఆ షరతుకు లోబరచి వదిలేయుటమే సమంజసం, రాజా!—ఉదారత కలిగి వుండు. ధర్మబుద్ధితో న్యాయంగా రాజ్యం యేలుకో..." అని బోధించగా, భటులు వచ్చి గుర్రంవంటిపైన వుండే అలంకారాలన్నీ తీసివేశారు. తీస్తూవుండగానే పంచకల్యాణి రూపంలో వున్న బోధిసత్వుడు పంచత్వంపొందాడు!

తరువాత కాశీరాజు ఆజ్ఞప్రకారం, సమస్తమైన మర్యాదలతోనూ గుర్రానికి ఉత్తరక్రియలు జరిగినై. వీరవర్మకు గొప్ప గౌరవం జరిగింది. ఏడుగురు సామంతులనూ వారివారి రాజ్యాలకు పంపివేశారు. నాటినుండీ కాశీరాజ్యంలో బోధిసత్వుని ఇష్టప్రకారం న్యాయసమ్మతంగా, ధర్మయుతంగా పరిపాలన సాగుతూవచ్చింది.






[విజయవర్మ, పానయ్యా సన్యాసివేషాలు ధరించి భీమవర్మ నివాసభవనానికి వెళతారు. అక్కడ కరుణను కబంధవర్మ అనే ఒక వృద్ధుడికి యిచ్చి వివాహం చేయబోతున్నారని తెలుసుకుంటారు. చండీదాసుకు అతడి అనుచరుడిద్వారా యీ వార్తను పంపి, పెండ్లి వారితోపాటు రహస్యంగా అడవిలోని దేవాలయానికి బయలుదేరతారు. ఆటుతరువాత—]

అరగంటసేపటికల్లా పెండ్లివారు అడవిలోని దేవాలయం చేరారు. పెండ్లికి పౌరోహిత్యం వహించేది భీమవర్మ ప్రాణమిత్రుడైన సోమశర్మ అనేసంగతి అప్పటికిగాని విజయవర్మకు తెలిసిందికాదు. తోడిసామంతులతో కలిసి వినోదంగా మాట్లాడుతూ, భీమవర్మ మాంచి ఉత్సాహంలో ఉన్నాడు. తను విజయవర్మనూ, శబ్దవేధినీకూడా కనుగప్పి కరుణకు వివాహం విజయవంతంగా చేయబోతున్నా ననుకుంటున్నాడు.

దేవాలయంలోనుంచి సోమశర్మ బయటికి వచ్చి, వధూవరులను సమీపించాడు. చెప్పలేని విచారంతో, వంచిన తల ఎత్తకుండావున్న కరుణనూ, ఆ పక్కనే వున్న వృద్ధ కబంధవర్మనూ దీవించాడు. ఆ నిమిషంలో, ఇక బలవంతపు పెండ్లి తప్పదేమో అనిపించింది విజయవర్మకు.

సోమశర్మ ముందునడవగా వధూవరులు అతనిని అనుసరించారు. ఒక్కసారి అడవి ప్రతిధ్వనించేలాగా మంగళతూర్యారావాలు మోగినై. అదే సమయంలో దేవాలయం చుట్టుపక్కల నున్న గుబురుచెట్లనుంచి ఒకేమారు రెండు బాణాలు రివ్వుమంటూ వచ్చి, ఒకటి సోమశర్మ భుజంలోనూ,





రెండవది కబంధవర్మ గుండెలోనూ గుచ్చుకుపోయినై!!

జనంలో హాహాకారాలు బయలుదేరినై. 'శబ్దవేధి! శబ్దవేధి!! వెతకండి చెట్లల్లో!!!' అంటూ భీమవర్మ కేకలుపెట్టాడు. గుండెలో అంబు గుచ్చుకున్న కబంధవర్మ, తీరని బాధతో పెద్దకేకపెట్టి, వెల్లకిలా పడి, ప్రాణం వదిలాడు. సోమశర్మమాత్రం భుజంలో గుచ్చుకొన్న బాణాన్ని చేతితో లాగి, అవతల విసరివేస్తూ—

"ఈ దురంతం శబ్దవేధిది కానే కాదు; విజయవర్మది! వాడూ యీ చుట్టుపక్కలే వుంటాడు. వెతకండి" అంటూ గర్జించాడు.

భీమవర్మ భటులు కొందరు పెండ్లి చూసేందుకు వచ్చిన ప్రజలందరినీ చుట్టుముట్టారు; మరికొందరు దేవాలయం చుట్టుపక్కల వున్న పొదలనూ, అడవిప్రాంతాన్నీ గాలించసాగారు.

విజయవర్మకు ఒకపక్కన సంతోషం, మరొకపక్కన విపరీతమైన భయం పట్టుకొన్నది. ఏదోవిధంగా వృద్ధ కబంధవర్మను చంపడంతో కరుణకు బలవంతపు పెళ్ళి తప్పింది. కాని చుట్టుముట్టి మనిషి మనిషినీ పరీక్షించి చూస్తున్న భీమవర్మ భటుల బారినుండి తనూ పానయ్యా బైట పడటం ఎలా? ఇది ఒక పెద్ద సమస్య ఐ కూర్చుంది.

"ఏం పానయ్యా, ఏమిటీదారి ఇప్పుడు?" అంటూ ఆత్రంగా ప్రశ్నించాడు విజయవర్మ.

"దారా దారి!" అని విస్తుపోయాడు పానయ్య. అతడికి పుట్టిమునిగిందిరా అని అనిపిస్తోంది. చివరికి చిత్తరపోయి అటూ యిటూ చూస్తూ "జైసీతారాం! అదే మనకు దారి. ప్రాణాలుంటే బ్రతుకుమార్గం; చస్తే ముక్తిమార్గం!" అనేశాడు.

"జై సీతారాం!" అన్నాడు విజయవర్మ, అంతకన్న చేసేదేమీ లేదనుకుంటూ.

"జై సీతారాం! హర హర హర..."







పానయ్యా యీ హరహరలు ముగించక ముందే సోమశర్మ పదిమంది భటులతో అతడిముందుకు వచ్చి నిలబడ్డాడు.

"ఎవరూ యీ జై సీతారాంగాళ్ళు ?" అంటూ గుడ్లురిమాడు.

"మేం... మేం...హిమాలయాల్లో అరవై ఏళ్లు తపస్సుచేసి..."

"అరవైఏళ్ళ తపస్సా? నిండా మీకు ముప్పయి ఏళ్ళన్నా లేవే! బంధించండి వీళ్లని," అంటూ ఆజ్ఞాపించాడు సోమశర్మ.

"తపస్సు అరవైఏళ్ళు కాదు...యిరవై ...పది...." అని పానయ్యా తడబడుతూ చెప్పబోతున్నాడు.

"బంధించండి వీళ్ళని. దొంగ సన్యాసులు," అని గద్దించాడు సోమశర్మ. వెంటనే భటులు విజయవర్మకూ, పానయ్యకూ అరదండాలు తగిలించారు.

అరదండాలు చేతికి పడటంతో అంతా ముగిసిపోయిందని అనిపించింది విజయవర్మకు. యిప్పుడు కాకపోతే ఇంకాస్సేపటి కయినా తనెవరో సోమశర్మా, భీమవర్మా గ్రహించగలరు. తరవాత జరగబోయేది ఏమిటో స్పష్టంగా తెలుస్తూనే వుంది. తనకూ, పానయ్యకూ కూడా బలవ...! విజయవర్మ ఈవిధంగా ఆలోచిస్తున్నంతలో, అక్కడికి భీమవర్మ మరి కొందరు కోసల్వారు సర్దారులతో కలిసి వచ్చాడు. అతడి ముఖాన కత్తి వాటుకుకూడా నెత్తురుచుక్క లేదు. అంతా సక్రమంగా, సవ్యంగా జరిగిపోతున్న సమయానికి, ఇలాంటి అవాంతరం రావడం అతడికి పట్టరాని కోపాన్ని తెప్పించింది.

సోమశర్మ విజయవర్మనూ పానయ్యనూ చూపుతూ—"వీళ్ళు దొంగసన్యాసులు. బహుశా చండీదాసు ముఠావాళ్లయి వుంటారు!" అన్నాడు భీమవర్మతో.

భీమవర్మ, విజయవర్మను సమీపించి నఖశిఖపర్యంతం నిప్పులు చెరిగే నేత్రాలతో







"విజయవర్మ ఎందుకు కాకూడదు ?" అంటూ పెద్దపెట్టున నవ్వాడు భీమవర్మ. "అవునా విజయా !" అంటూ విజయవర్మ బుజం తట్టాడు.

సోమశర్మ ఆ మాటలతో కంపించి పోయాడు. చుట్టూవున్న కోసల్వారు సర్దారులు ఆశ్చర్యంతో కళ్లప్పగించి చూస్తున్నారు. విజయవర్మమాత్రం తొణక్కుండా—

"అవును నేను విజయవర్మనే! నీకూ, సోమశర్మకూ కూడా బద్ధశత్రువును!" అన్నాడు.

"బోనులో చిక్కకముందు బద్ధశత్రువువే! కాని ఇప్పుడు......? సరే, ఈ యతీశ్వరు లెవరు ?" అన్నాడు భీమవర్మ వేళాకోళంగా.

"అతడా? అతడు నా కుడిబుజం. పడవల పానయ్య !!"

"ఓహో, పడవల పానయ్యగారా !" అంటూ భీమవర్మ పెద్దగా నవ్వాడు. చుట్టూ ఉన్నవాళ్లుకూడా పొట్ట చెక్కలయ్యేలా నవ్వసాగారు. భీమవర్మ కుడిచేతితో అందరినీ వారించి, ఎడమచేతితో పానయ్య గడ్డం పట్టుకు గుంజుతూ—

"పడవల పానయ్యగారు, ఆ వ్యాపారంలో కన్న ఈ వ్యాపారంలో గిట్టుబాటు ఎక్కువగా

పరికించిచూశాడు. తరవాత హఠాత్తుగా ఏదో తెలుసుకున్నవాడిలా విజయవర్మ గడ్డం పట్టుకుని గుంజాడు. గుంజేసరికల్లా, ఆశ్చర్యం కలిగించేటట్టుగా అతికించుకున్న విజయవర్మ గడ్డం గభీమని భీమవర్మ చేతిలోకి వచ్చేసింది.

"హఁహ్హహ్హఁ !" అంటూ భావగర్భితంగా నవ్వాడు భీమవర్మ. తరవాత సోమశర్మ కేసి తిరిగి—

"వీళ్ళు చండీదాసు ముఠా అనేనా నీ అభిప్రాయం !" అన్నాడు.

"అవును. తెలుస్తూనేవుంది. ఆ దొంగ గడ్డం, దొంగ చూపులూ..."

వుంటుందని భావించారన్న మాట!" అన్నాడు, వేళాకోళంగా.

ఈ మాటలతో తిరిగి అక్కడ చేరిన వాళ్ళంతా పెద్దగా నవ్వారు. పానయ్యకు ఆ సమయంలో ప్రాణభీతి అనేదే గుర్తు లేకుండా పోయింది. కోపంతో పళ్లు పటపట కొరుకుతూ యిలా అన్నాడు:

"మేము బోనులో చిక్కవచ్చు. కాని, మిమ్మల్ని బోనులో చిక్కించుకునేందుకు తయారుగా వున్న చండీదాసును మట్టుకు మరిచిపోకండి. అభయవర్మను చిత్రవధ చేసిన హంతకులను అతని పుత్రుడు విజయవర్మ హతమార్చలేకపోతే, చండీదాసు ఆ పని ముగించగలడుసుమండీ!"

పానయ్య పరుషంగా అన్న ఈ వాక్యాలు భీమవర్మతోపాటు అతడి అనుచరులను కూడా నిర్విణ్ణులను చేసినై. నిశ్చేష్టుడయ్యాడు సోమశర్మ. అతడి నోట మాట లేదు. ఆపాదమస్తకమూ గాలితాకుడు తిన్న గరికపోచలాగా వూగిసలాడిపోతున్నాడు.

భీమవర్మ ఓ క్షణంపాటు తల వంచుకుని వుండిపోయాడు. ఏదో ఒక నిర్ణయం తక్షణం చేయవలసివుందనీ, విజయవర్మను యిక జీవాలతో పోనివ్వగూడదనీ అతడు నిశ్చయించుకొన్నాడు.




"నలుగురు రాజులు చేరినచోట న్యాయం చరిస్తుందని న్యాయశాస్త్రాలు ఘోషిస్తున్నయ్. దీనికి అందరూ అంగీకరిస్తారా?" అన్నాడు భీమవర్మ:

"అంగీకరిస్తున్నాం!" అంటూ సర్దారులు అందరూ ఏకకంఠంతో పలికారు. అప్పటికి సోమశర్మ తేరుకొని యిలా ప్రారంభించాడు:

"వీళ్లని శత్రుసైనికులుగా పరిగణించనవసరంలేదు. హంతకులు... సామాన్య హంతకులు... ధర్మశాస్త్రాలుకూడా..."

"సోమశర్మా ఆగు!" అంటూ భీమవర్మ అతడి మాటలకు అడ్డువచ్చాడు. "వీళ్ళు హంతకులకన్నా నీచులు. ఆధ్యాత్మిక




పరులైన యతీశ్వరులకుకూడా, వీళ్లు దొంగ వేషాలతో అవమానం కలిగించారు. పవిత్రమైన దేవాలయ ప్రాంగణాన్ని రక్తసిక్తం చేశారు. పెండ్లిబట్టలతో వున్న కబంధవర్మను..."

"వీళ్ళకు మరణశిక్ష విధించేందుకు వీటిల్లో ఏ ఒక్క నేరంఅయినా సరిపోతుంది!" అన్నాడు సోమశర్మ కోపం పట్టలేక.

"అయితే వీళ్లకు మరణశిక్ష విధించాను. గొంతుకు వుచ్చు బిగించి ప్రాణం పోయే వరకూ చెట్టుకు వేలాడతీయడంద్వారా ఆ శిక్షను అమలుజరపాలి. ఏం?— అందరికీ సమ్మతమేనా?" అంటూ భీమవర్మ చుట్టూ చూశాడు.

"సమ్మతమే! మాకందరకూ సమ్మతమే!" అంటూ సర్దారులందరూ ఏక కంఠంతో పలికారు. కాని, అదేసమయంలో కంచు ధ్వనిలాంటి ధ్వనితో యీ వాక్యాలు వినిపించినై—

"దేవపూర్ జమీందారును నేను! మీరంతా కేవలం నా అతిథులుమాత్రమే. నా అనుమతి లేకుండా యిక్కడ న్యాయ విచారణ జరిగేందుకు వీలులేదు!"

భీమవర్మ, సోమశర్మలతోపాటు అందరూ ఆ ధ్వని వచ్చినవైపుకి తిరిగిచూశారు. దేవపూర్ జమీందారు పదిమంది సైనికులతో అక్కడికి రావడం కనిపించింది. గౌరవ సూచకంగా అందరూ ఆయనకు అభివాదనం చెప్పి ఆహ్వానించారు.

దేవపూర్‌జమీందారు రాకతో విజయవర్మ, పానయ్యలలో తిరిగీ ధైర్యోత్సాహాలు కలిగినై. నిజం ఆలోచిస్తే కబంధవర్మ హత్యకు కారణం తాముకాదు. తమను హంతకులని నిర్ణయించేటందుకు ఏ న్యాయాధిపతికీ సాధ్యం కాదు. మహా అయితే కబంధవర్మ హంతకులతో సంబంధం కలిగివున్నారని మాత్రమే నేరం



మోపటానికి విలవుతుంది తమమీద! దేవపూర్ జమీందారును చూసేసరికి భీమవర్మకు అరికాలిమంట నెత్తికెక్కింది. పానకంలో పుడకలాగా వీడేమిటి యిలా తయారయ్యాడు అనుకున్నాడు. కాని తను కత్తితో చేయగలిగిందేమీ లేదు; అంతా ఉపాయంతో సాధించాలిసిందే! అందుకనే ఇలా అన్నాడు—

"వీళ్ళిద్దరూ హంతకులు! పెండ్లిదుస్తులతో వున్న కబంధవర్మను హత్యచేశారు."

"వీళ్ళదగ్గిర కత్తులూ, కఠారులూ ఉన్నట్టు లేవే?" అంటూ తన అనుమానాన్ని బయటపెట్టాడు దేవపూర్ జమీందారు.

"బాణంతో అతన్ని హత్యచేశారు. నేను కొద్దిలో బ్రతికి బయటపడ్డాను. ఈ మారు వేషాలలో వుండటమే వీళ్లు హంతకులని తెలియపరుస్తోంది" అన్నాడు సోమశర్మ.

"యీ దేవపూర్ సంస్థానంలో మారువేషం వేసినంతమాత్రాన ఎవరినీ హంతకులుగా పరిగణించము. బాణంవేసి కబంధవర్మను హత్య చేశారనేటందుకు సాక్ష్యంవున్నట్టు లేదు. సరే... అంతా మేం న్యాయవిచారణ చేయగలం," అన్నాడు దేవపూర్ జమీందారు.




విజయవర్మనూ, పానయ్యనూ దేవపూర్ జమీందారు వెంటవున్న సైనికులు కైవశం చేసుకున్నారు. చేసేదేమీ లేక విస్తుపోయి చూస్తున్న భీమవర్మ, అతడి తోడి సర్దారుల ముందునుంచే ఖైదీలను నడిపించుకు పోసాగాడు. భీమవర్మ యిక ఉండబట్టలేక:

"దేవపూర్ సంస్థాన శాసనాలకు మేం బద్ధులం. యిక్కడ కేవలం అతిథులం అన్నసంగతికూడా మాకు తెలుసు. కాని కోసల్పూరుప్రభువుకు వ్యతిరేకి అయిన వాణ్ణి, మీరు సహించి వదలలేరు అని నమ్ముతున్నాం," అన్నాడు.

ఆ మాటలతో దేవపూర్ జమీందారు తక్కున ఆగిపోయాడు. సాలోచనగా భీమ వర్మను సమీపించి తగ్గుస్థాయిలో మంత నాలు జరిపాడు. తరవాత అతడిదగ్గిర నుంచి సెలవుతీసుకొంటూ—

"మన మంతా కోసల్వారుప్రభువుల అనుచరులమే! బీసల్వారు ద్రోహులతో చేయికలిపినవా డెవడూ ప్రాణాలతో నా దగ్గిరనుంచి బయటపడలేడు. అలా అని మీ అందరికీ వాగ్దానం చేస్తున్నాను" అన్నాడు.

సోమశర్మా, భీమవర్మలు ఆ మాటలతో పరవశులయ్యారు. పానయ్యకు పైప్రాణం పైనే పోయినట్టయింది. కాలే పెనంమీద నుంచి మండుతూవున్న పొయ్యిలో పడి నట్టయిందే పరిస్థితి అనుకున్నాడు విజయ వర్మ. కాని విధికి తల ఒగ్గి గుండెబిగువుతో పూరుకున్నాడు.

దేవపూర్‌జమీందారు సైనికులు ఖైదీ లను ముందు నడవమన్నారు. ఆ అడవి ప్రాంతందాటి పట్టణం సమీపించేసరికి విజయవర్మకు హఠాత్తుగా కరుణ గుర్తు కొచ్చింది. కబంధవర్మ గుండెల్లో బాణం తగలగానే రేగిన గగ్గోలులో కరుణ ఏమ యిందీ తను చూడనే లేకపోయాడు.

"కరుణ ఏమైనట్టు?" అని అడిగాడు పానయ్యను విజయవర్మ.

"ఏమయితేనేం? ముందు మనసంగతి ఆలోచించు!" అన్నాడు పానయ్య.

"నడవండి! ఊఁ!" అంటూ దేవపూర్ జమీందారు సైనికులు వాళ్లను గద్దించారు. మృత్యుముఖంలోకి సరాసరి నడుస్తున్నా మనుకొంటూ పానయ్య, విజయవర్మలు భావించసాగారు. కొద్దిసేపటిలో వారు దేవ పూర్ జమీందారు భవనం చేరుకొన్నారు.

—(ఇంకా వుంది)






అనగనగనగా ఒక వూరిలో ఇద్దరు స్నేహితులు. వాళ్ళిద్దరూ బాగా వ్యాపారంచేసి, డబ్బు కూడబెట్టుతున్నవాళ్ళే. ఐతే— మొదటివాడు కొంచెం కర్చుమనిషి. రెండవ వాడికి ఎంత వచ్చినా ఇంకా రావాలి అనే కాంక్ష ఎక్కువ. మొదటివాడికి నున్నటి గుండు; రెండవవాడు ఏ కారణంవల్లనో గెడ్డం పెంచాడు.

ఒకరోజున ఇద్దరూ సరదాగా మాట్లాడుకొంటూవుండగా, మొదటివాడు "నేస్తం! ఇన్నాళ్లాయె నీ ఎదట అన్నలేదు కాని, నీ గెడ్డం చూస్తే ఎంతో ముచ్చటవేస్తూందోయ్. ఇంత వరకూ నే నెన్నో గెడ్డాలు చూచుకొంటూ వస్తున్నా. నీ గెడ్డంలాంటి గెడ్డంమట్టుకు మన దేశంలోనే లేదంటే నమ్ము" అన్నాడు.

ఇందుకు రెండవవాడు మురిసిపోతూ, "అవును, మిత్రమా!—అందరూ అలాగే అంటున్నారు. అంతేకాదు. ఎంతోమంది నా గెడ్డంమీద కన్ను వేశారు కూడాను. అవకాశం దొరికితే వాళ్ళు కొనివేదామని కూడా వున్నారు" అని చెబుతూ, తనగెడ్డంలోకి కుడిచేతి ఐదువేళ్ళూ పోనిచ్చి ఉత్సాహంతో నిమురజొచ్చాడు.

ఈ మాట వినగానే, మొదటివాడు ఆత్రంతో "ఎవడో ఎందుకు? నేనే కొంటా. ఎంతో చెప్పు!" అన్నాడు.

ధనాశ గల రెండవవాడికి మనస్సులో అనేకమైన వూహలు ఒక్కసారిగా పరుగులెత్తినై. అప్రయత్నంగా మాటవరసకు ఇలా అనేశాడు: "ఐతే ఒకవెయ్యి మొహిరీలు ఇయ్యిచూదాం."

"ఓ. దానికేం! తప్పకుండా తీసుకో. ఇంకా నువ్వెంత గొప్ప వెల కోరతావో నను కున్నాను నేసూ..." అంటూ, గభీమని జేబులోనించి తీసి కొంతసొమ్ము బయానా ఇచ్చాడు మొదటివాడు.

ఎన్. ముకుందరావు





రాసుకున్నారు. మొదటివాడు మళ్లీ ఇంకొక సారి హెచ్చరించాడు: "అబ్బాయీ!— ఇటుపైన ఎవరైనా ఆ గెడ్డాన్ని చూచి, బాగా వున్నదీ అని మెచ్చుకున్నట్టయితే, వారితో నువ్వు "అయ్యా! ఈ గెడ్డం నాదికాదండి. ఫలానావారిది. అయన దీనిని వెల యిచ్చి కొనేసుకున్నాడు. ఆయనకోసమే నేను దీనిని పోషించుకు వస్తున్నాను' అని ఈవిధంగా చెప్పాలి, తెలిసిందా?"

'సరే' నన్నాడు రెండవవాడు.

మరునాటినుంచీ—

వేళాపాళా లేకుండా మొదటివాడు రెండవవాడిదగ్గరకు వస్తూండేవాడు. "ఏం నేస్తం ఇలా వచ్చావు?" అని పలకరిస్తే "మరేంలేదు. నా గెడ్డం ఎలావుందో చూచుకు పోదామని వచ్చా" అనేవాడు.

ఒక్కొక్కనాడు ఉరుము లురుముతూ వచ్చి, "ఇదేమిటయ్యా, నా గెడ్డమంతా నాశనం చేస్తున్నావే! నిగనిగలాడుతూ మెరిసిపోవలసిన నా గెడ్డానికి చవుకబారు కొబ్బరినూనె పట్టిస్తే ఎలా అనుకొన్నావు? ఐనా, తీరూ తెన్నూ లేకుండా ఏమిటీ దువ్వుకోవటం బొత్తుగా నాగరకతఅనేది లేకుండా?' అంటూ కసిరి కేకలు వేసేవాడు. ఇలా హయాం చెలాయించేసరికి, రెండవ

ఇందుకు రెండవవాడు బిత్తరపోయాడు. మొదటివాడు ఒకేఒక షరతు పెడుతూ "అబ్బాయీ!— ఇంతటినుంచీ ఆ గెడ్డం నాది. ఐతే, నీ సొమ్ము నీకు పూర్తిగా చెల్లించి నా గెడ్డం నేను తీసేసుకునేవరకూ దాన్ని నీవు జాగర్తగా కాపాడవలసి వుంటుంది. తెలిసిందా?—నా గెడ్డానికి నా యిష్టప్రకారం తైలం రాయాలి. నేను చెప్పిన విధంగా దానిని కత్తిరిస్తూవుండాలి" అని హెచ్చరించాడు.

'ఓస్. దీనికేముంది!' అని అనుకొంటూ రెండవవాడు వెంటనే, వాని షరతుకు అంగీకరించాడు. వ్రాతపూర్వకంగా పత్రాలు







వాడి ప్రాణం విసిగిపోయింది. స్నేహితుని పోరు పడలేకపోయాడు. ఇద్దరికీ బెడిసింది.

"బాబూ!—నీకు పుణ్యముంటుంది. ఏదో గడ్డి తిని ధనాశచేత ముందువెనకలు యోచించకుండా వప్పుకున్నాను. నాగెడ్డం మళ్లీ నా కిచ్చెయి. నీ డబ్బు నీవు తీసేసుకో" అని ప్రాధేయపడ్డాడు.

మొదటివాడు వప్పలేదు. రెండవవాడు 'పోనీ, నీ ఇచ్చిందానికి రెట్టింపు తీసుకో!' అన్నాడు. మొదటివాడు మాటాడలేదు. రెండవవాడు ఎలాఐనా ఈ పీడ వదిలించుకుందామనుకొని, నాలుగు వేలిస్తానన్నాడు. ఇదెంతవరకూ పోతుందో చూదామని, మొదటివాడు వేడుకచూస్తూ బెట్టుగానే ఉంటూ వచ్చాడు.

రెండవవాడికి ఏమీ తోచిందికాదు. గట్టి చిక్కులో పడ్డాడు. ఇలా వుండగా,—ఒక నాటి రాత్రి మొదటివాడు మామూలుగా వచ్చాడు. రెండవవాడు గాఢ నిద్రలో ఉన్నప్పటికీ సంశయించక మొండిచొరవతో గెడ్డంపట్టుకు లాగాడు. ఆశ్చర్యం!—గెడ్డం గెడ్డంపళంగా వానిచేతిలోకి ఊడివచ్చేసింది!!

మొదటివాడు గభీమని లేచి, గోలచేసుకొంటూ న్యాయాధిపతిదగ్గరకు పోయి, మొర పెట్టుకొన్నాడు. తెలివిమంతుడైన అధికారి, ఇద్దరి వుద్దేశాలనూ క్షణంలో గ్రహించి వేశాడు. విచారణ జరిపాడు.

'గెడ్డం నేను కొన్నాను, హక్కు నాది' అనే ధీమాతో మొదటివాడు స్నేహితుణ్ణి హింసలుపెట్టడం, వాడు పెట్టే యాతనలు పడలేక—రెండవవాడు మాయగెడ్డం అంటించుకోవటం, వెల్లడయింది.

మొదటివాడు అర్ధరాత్రప్పుడు పనికట్టుకు వెళ్ళి బలవంతాన లాక్కొన్న గెడ్డం తనే పట్టుకపోవలసిందనీ, రెండవవానికి అతను ఈయవలసిన బాకీ—గెడ్డం ఖరీదు—కర్చులతోసహా తక్షణమే చెల్లించవలసిందనీ అధికారి తీర్పు చెప్పాడు.



# ముచ్చటైన మూడు టైపు చిత్రాలు



ఎమ్. అన్నపూర్ణ




పి. పెద్దిరాజు



హెచ్. ఎస్. సెట్టి




# ముక్తి నిచ్చే భూసారంగం

పహార్వారరాజ్యంలోని జితరా అనే గ్రామమందు పూర్వం కూపాకుంభకారు డనే ఒక కుమ్మరి ఉండేవాడు. అతడు సజ్జనుడు, భక్తిజ్ఞాన వైరాగ్యాలు కలవాడున్ను. అతని భార్య కుంభకారునికి తగిన యిల్లాలు. గుణవంతురాలు. ఇద్దరూ కష్టపడి సంసారం సాగించుకొంటూ, పాండురంగస్వామినీ, స్వామిభక్తులనూ శ్రద్ధతో సేవించుకొంటూ ఉండేవారు.

వాళ్ళు రోజుకు ఒక కుండచొప్పున తయారుచేయటం, నెలవరకూ కూడబెట్టి నెల్లాళ్ళూ కాగానే ఒక్కసారిగా ముప్ఫయి కుండలూ అమ్మివేసి, అందులో నాల్గవ వంతు విష్ణుభక్తులకూ సాధువులకూ వినియోగిస్తూ తక్కినదే తమ భుక్తికోసం ఖర్చు పెట్టుకోవటం—ఇలా జరుగుతూ వచ్చింది.

ఇలా చేస్తున్న కుంభకారుడుకి జితరా గ్రామంలో నేగాక, చుట్టపక్కలసైతం 'ఫలానా కుంభకారుడు ధర్మాత్ముడు, హరిభక్తుడు, సాధుజన సేవాపరాయణుడు' అని గొప్ప పేరుపడింది.

ఐతే—అవూరి రాజుకి ఈ సంగతి తెలిసి అసూయ కలిగింది. ఈ అసూయతో, కుమ్మరి వాళ్ళందరూ ఆవం ఒక్కంటికి పదేసి కుండలు చొప్పున ప్రతినెలా పన్ను చెల్లించవలసిందని ఆజ్ఞాపించాడు. జరుగుబాటు ఉన్న తక్కిన కుమ్మరివాళ్లంతా రాజు విధించినప్రకారం పన్ను చెల్లిస్తూ వచ్చారు. కాని కూపాకుంభకారుడుమట్టుకి చెల్లించుకోలేక దారాపుత్రాదులతో సహా దివాణంలోకి పరుగెత్తిపోయి గోలపెట్టాడు.

రాజు వాని మాటలన్నీ విని, "నీవేమిటయ్యా, దానధర్మాలుచేసి లోకంలో గొప్ప కీర్తి ఆర్జించావు. ఎంత ధనికుడవు కాకుంటే నీకింతటి పేరు వస్తుంది. నీవంటి శ్రీమంతుడికి స్వల్పమైన ఈ పన్ను చెల్లించడమనేది

వి. జానకి



"ఏపాటి!" అంటూ వికటంగా జవాబు చెప్పాడు. కుంభకారుడు ఎంత బతిమాలుకున్నా నిర్దయుడైన రాజు వినిపించుకోలేదు.

చేసేదేముంది?—కుంభకారుడు బయల్దేరి వచ్చేశాడు. తనూ భార్యా కలిసి నాటి నుంచీ రెట్టింపుగా పాటుపడసాగారు. ఎంత పాటుపడ్డా నెలకు ముప్ఫయి కుండలకు మించి ఏర్పడకపోయె. నిరాశచేసుకున్నారు. కాని, ఒకరోజున ఆమె ఆవం పేర్చి, కాల్చి చల్లార్చి తీసేసరికల్లా ఆశ్చర్యం కొలిపేటట్టుగా, నలభై కుండలు కనిపించినై!!

ఇదంతా ఆ పాండురంగని మహత్యమే అని నమ్మి, కుంభకారుడు వెనుకటికంటే ఎక్కువగా స్వామిపూజా, భక్తుల ఆరాధనా జరిపిస్తూ, దివాణపు పన్ను పదికుండలూ చెల్లించివేస్తూ సుఖంగా కాలక్షేపం చేస్తున్నాడు.

ఇలా ఉండగా—ఒక సాధుబృందం బయల్దేరివచ్చి జితరాగ్రామంలో విడిసింది. వారు తిన్నగా కుంభకారుని ఇంటివద్దకు వచ్చి "జైసీతారాం!—" అంటూ భగవన్నామస్మరణ చేశారు. అప్పుడు లోపలి నుంచి కుంభకారుడూ అతని భార్యా ఇవతలికి వచ్చి, సాధువులను కూర్చుండబెట్టి, కుశలప్రశ్నలు వేశారు.

అందులో ఒక సన్యాసి, "అయ్యా, భక్తాగ్రేసరా!—నేటికి ఐదారు రోజులాయె మాకు భోజనభాజనాలు లేవు. ఇవాళ నీ యింట భోజనంచేయాలనే కుతూహలంతో వచ్చాము" అన్నాడు. అందుకు కుంభకారుడూ, భార్యా "భక్తరక్షకుడైన పాండురంగడు మన పాలిట ఉండగా చింత ఎందుకు?" అన్నారు.

వారికి భోజనాలు సమకూర్చటానికి కావలసిన ధనం అప్పు తీసుకువద్దామని ఒక వర్తకుని ఇంటికి వెళ్ళాడు కుంభకారుడు. ఆ వర్తకుడు ఇతనిని చూచి, "ఏమిటయ్యా కూపా!—ఇదివరకు తిని

కొన్న అప్పులే తీర్చలేదే. మళ్ళీ కొత్త అప్పు కావాలంటున్నావేమిటి?" అంటూ, "సరే. నాకొక బావి కావాలి, తవ్వటానికి పప్పు కొంటావా?" అని అడిగాడు. కుంభకారుడు అంగీకరించాడు. వెంటనే వర్తకుడు కోరినంత ధనమీయగా, కుంభకారుడు వస్తు జాలమంతా సమకూర్చుకొనిపోయి, దిగ్విజయంగా సాధుసమారాధన పూర్తిచేసుకొన్నాడు. తరువాత కుంభకారుడు పార, పలుగు మొదలైన ఉప్పరిసామానులు చేత పట్టుకొని వర్తకునివద్దకు వెళ్ళాడు. వర్తకుడు స్థలం చూపించగా, కుంభకారుడూ భార్యా బావి తవ్వనారంభించారు.

ఇలా వారు రెండురోజులు తవ్వి, మూడవనాడుకూడా తవ్వబోయేసరికి శ్రీహరి కృపావిశేషంవల్ల లోపలినుండి మహోజ్వలంగా నీటిబుగ్గ ఒకటి ప్రవహింపసాగింది. వర్తకుడూ, అక్కడవున్న అందరూ ఆశ్చర్యంతో ఆ సమీపానికిపోయి చూస్తూండగా, కూపా అడుగులుపెట్టినచోట హఠాత్తుగా భూమి క్రుంగి, అతడు ఆ సొరంగంలో పడిపోయాడు!

భర్త పడిపోవటంచూచి అతని భార్య కూడా సొరంగంలో పడబోమని వెళుతూ వుండగా, అమెనుపట్టి వెనక్కులాగారు.



అంతలో అశరీరవాణి "అమ్మా!–నీ భర్త మృతిపొందలేదు. ఐతే, ఒక్క సంవత్సర కాలంపాటుమాత్రం అతను అక్కడినుండి రాలేడు. సంవత్సరమూ అయినవెంటనే తనంత తనే వచ్చేస్తాడు. అప్పుడు నీవూ అతనూ కలిసి లోకంలో భక్తిభావాన్ని ఉజ్జీవింపచేయాలి. కనుక తొందరపడకు."

ఈమాటలకు ఆమె ఒడబడి, ఇంటికి వెళ్ళి, నాటినించీ ఏకాంతంగా శ్రీహరిని ధ్యానిస్తూ కాలక్షేపం చేయసాగింది.

అన్నట్టుగానే సంవత్సరకాలమూ పూర్తి అయింది. కాగానే, ఎక్కడైతే కూపకుంభకారుడు బావిఒడ్డున నిలబడి భూసొరంగ

మందు కూలిపోయాడో, ఆచోట రోజూ రాత్రివేళల శ్రీహరికథాసంకీర్తనం, గజ్జెల మోతలూ, మధురమైన శ్రావ్యధ్వనులూ, మేళతాళాదులూ మనోహరమైన చప్పుళ్ళూ, ఈ సందడి అంతా వినబడజొచ్చింది.

ఇదిచూచి ప్రజలంతా విస్మయం పొందారు. ఈ సంగతి ఆనోటా ఆనోటా ప్రాకిపోయి, రాజుచెవుల బడింది. ఇదేమిటా చిత్రం అని తలిచి ఆ రాజు, తను దగ్గరనే వుండి బావి తవ్విస్తూ, పైమన్ను జాగ్రత్తగా తోడించి పారబోయించి చూస్తే—అక్కడ బంగరు తూగుటుయ్యేలలో శంఖచక్రాలతో కౌస్తుభాదిభూషలతో వెలిగిపోయే ఆ స్వామి స్వరూపం సాక్షాత్కరించింది!

ఆ స్వరూపానికి ఎదురుగా కూపాకుంభకారుడు తన్మయుడై హరినామసంకీర్తనం చేయటంకూడా కానవచ్చింది!!

అప్పుడు రాజు, మహాత్ముడైన కుంభకారుణ్ణి బయటికి తీయించి పౌరులందరకూ చూపగా, వారందరూ గబగబ వచ్చి ఆయన పాదాలకు నమస్కరించారు. బావి తవ్వమని అజ్ఞాపించిన వర్తకుడూ, సుంకం విధించిన రాజూ వచ్చి క్షమింపమని అతనిని వేడుకొన్నారు.

కుంభకారుడు వారినందరనూ లేవనెత్తి, "అయ్యా!—మీ కరుణవల్లనేకదా నేనీ సంవత్సరకాలం అవిచ్ఛిన్నంగా శ్రీహరిని సేవించుకోవటానికి వీలుకలిగింది. ఈ ఫలమంతా మీదేసుమండీ!" అంటూ వారికి తన కృతజ్ఞతను తెలిపాడు.

అదిమొదలుకొని ఆ ప్రదేశమంతటా ఎన్నో ఆలయాలు వెలిసినై. ప్రజలలో భక్తిభావం హెచ్చింది. భాగవతులకు సమస్తమైన ఉపచారాలు జరుగుతూవచ్చినై.

ఇప్పటికీ కూపాకుంభకారుడు హరిప్రసన్నతవల్ల అర్జించిన ఆ కూపం పాండురంగ క్షేత్రమందున్నది. భక్తులు దానిని దర్శించినతరువాతనే స్వామిని దర్శిస్తారు.






# మిఠాయివర్తకుడు

వివేకానందస్వామి సన్యాసం పుచ్చుకొని దేశాటనం చేస్తూవుండే రోజు లవి. మండు వేసంగి. మధ్యాహ్నంపూట. వివేకానందుడు రాజపుత్రస్థానంలో రైలుప్రయాణం చేయ వలసివచ్చింది. స్వామి పక్కనే ఒక వర్తకుడు కూర్చునివున్నాడు. స్వామికి కొన్ని పూటలనుండి తిండిలేదు. స్టేషనుస్టేషను వద్ద మంచినీళ్ళిచ్చేవాణ్ణి కాసిన్ని నీళ్లిమ్మని అడిగేవాడు. చేతిలో ఏమీపెట్టకపోవటంచేత స్వామిమాట వినిపించుకోకుండానే వాడు మరిఒక చోటికి పోయేవాడు. ఇటువంటి స్థితిలో పాపం, స్వామికి దాహంవేసి జిహ్వ అరుకుపోతూవుండేది.

వివేకానందుని ప్రక్కన కూర్చున్న వర్తకునికి సాధువులన్నా సన్యాసులన్నా పరమా సహ్యం. అతను ధనవంతుడు కావటంచేత పళ్ళూ, పాలూ, భక్ష్యాలు, చల్లని మంచినీళ్లు కొనుక్కొని ఆరగిస్తూ ఉండేవాడు. అలా ఆరగించడంలో తప్పలేదు. కాని, అతను స్వామిని చూచి నవ్వుతూ, వెక్కిరిస్తూ, పిల్లపేవులు కదిలించే కుళ్ళుమాటలు ఆడుతూ చాలా బాధపెట్టసాగాడు.

చివరి కిద్దరూ తారిఘాట్టు స్టేషనులో దిగారు. డబ్బులేని స్వామి మొహం ఎవరు చూస్తారు? మంచినీళ్ళు కాదుకదా, స్టేషనులో తలదాచుకోడానికి నీడ ఉన్న చోటుకూడా దొరకలేదు. అందుచేత, పైశాటి తడుపుకొని, స్టేషనుబయట కాళ్ళు మాడుతున్న ఇసుకమీద పరుచుకొని, ఒక స్తంభానికి ఆనుకొని కూర్చున్నాడు. ఆయన ఎదుటనే కొంచెందూరంలో చల్లని చోట మృదువైన ఆస్తరణమీద సమస్తమైనటువంటి భోగపదార్థాలూ పెట్టుకుని నక్షత్రకుని లాగా వర్తకుడు కూర్చున్నాడు.

డి. ఎమ్. లింగమూర్తి





నికి ఎవడేం చేస్తాడు? అనుభవించు. తీరికగా కూర్చుని, తృప్తిగా అనుభవించు" అని ఈ విధంగా స్వామిని పిల్చి చెప్పుతూ, పెదవులు బిగించిచూస్తూ, పకపక నవ్వుతూ లొట్టలు వేసి తింటూ, గుటకలు వేసి తాగుతూ, తెగతేనుస్తూ అనేక విధాల బాధింపజొచ్చాడు.

ఈ పరిహాస వాక్యాలకూ, తెలివితక్కువ పనులకూ కొంచెమైనా కోపగించక, విగ్రహంవలె కూర్చుని వున్నాడు స్వామి.

ఇంతలో అపూరిఅతడే ఒకాయన కుడి చేతితో ఒక మూటా, లోటా, ఎడమచేతిలో చల్లని మంచితీర్థంతో ఒక మట్టికూజా పట్టుకొని చంకలో ఒక మెత్త, చిన్న దుప్పటీ పెట్టుకొని పరుగుపరుగున స్టేషను చేరు కున్నాడు. శుభ్రమైన ఒకచోట దుప్పటి పరచి, మూట విప్పి, అందులోని రకరకాల భోజనపదార్థాలన్నీ దానిపైన అమర్చి, సంతోషంతో స్వామివద్దకు వగర్చుకొంటూ వచ్చి, "బాబూజీ! ఇలా దయచేయుండి. చప్పున రండి. ఈ పదార్థాలు భుజించండి" అని ప్రార్థించాడు.

కూర్చున్నవాడు వూరుకోక "ఏమయ్యా స్వామిజీ! ఇటుచూడు. ఆహా! ఎంత చల్లని మంచినీళ్ళు! ఓహో! ఎంత రుచిగా వున్నై లడ్డూలు! కరకరలాడే ఈ తియ్యటి పూరీలు చూడు! ఏం, నీ గ్రహచారం ఏం కాలింది? సన్యాసం పుచ్చుకొని ఏమి బావు కుంటున్నావు? మద్దిమానులాగా వున్నావే? ఏదైనా పనిచేసుకుని, డబ్బు సంపాదించుకు సుఖపడరాదూ? ధనహీనుడంటే ఏమిటి? బుద్ధిహీనుడన్నమాట. జేబూ ఖాళిగా వుంటే పొట్టమాత్రం పట్టిదిగా వుండదూ? డబ్బు అక్కర్లేదూ అనే వెర్రివెంగలయ్యలకి శాస్తి కావలసిందే! తెచ్చిపెట్టుకున్న కష్టా

స్వామి ఆశ్చర్యపోయాడు. స్వామిని వెక్కిరించిన సావుకారు వెలవెలబోయిన ముఖంతో, దాకనోటితో, తెరిచిన కన్నులు





మూయకుండా చూస్తూ, శిలావిగ్రహంలాగా వుండిపోయాడు.

కొత్తగా వచ్చినతడు—"బాబాజీ! ఆలస్యంచెయ్యకు, బాబాజీ! చప్పున వచ్చి భోంచెయ్యి బాబాజీ!" అంటూ స్వామిని బతిమాలి బలవంతపెట్టసాగాడు.

అందుకు స్వామి—"నేస్తం! నీవేదో పొరబడుతున్నట్టున్నావు. ఎవరినిచూచి ఎవరనుకొంటున్నావో! ఇంతకూ నిన్నెక్కడ చూచానో నాకు జ్ఞాపకమే లేదు" అన్నాడు.




అప్పుడు గ్రామస్థుడు–"సరిసరి బాబాజీ! నేను మిమ్మల్ని చూచాను. కళ్లారా చూచాను. పొరపాటు ఏమీ లేదు" అని చెప్పాడు. ఈ మాటలకు వర్తకుడు తెర్ర నోరు పెట్టుకొని చూస్తున్నాడు. అతి ఆశ్చర్యంతో స్వామి—"అయ్యా! నీ మాటలు నాకేమీ బోధపడటంలేదు. నన్నెక్కడ చూచావు?" అని అడిగాడు.

అందుకు గ్రామస్థుడు "బాబాజీ! నే నీవూరు మిఠాయివర్తకుణ్ణి. ఇవాళ పొద్దున్నే భోజనం చేసి, మామూలుప్రకారం పడుకుని కన్నుమూశాను. అప్పుడు ఒక కలవచ్చింది. ఆ కలలో శ్రీరామచంద్రమూర్తి నిన్ను—సరిగా నీవంటివానినే—వేలుపెట్టి చూపి "అదిగో, నీ ఎదట అగపడేవాడు నిన్నటి నుండీ తిండిలేక బాధపడుతున్నాడు. ఆ బాధఅంతా నేను పడుతున్నాను. లే, వెంటనే లేచి, పూరీలూ కూరలూ చేసి, అవీ, మిఠాయిలూ, చల్లని మంచి తీర్థమూ, కూర్చోవటానికి ఒక చిన్నమెత్త–ఇవన్నీ రైలుస్టేషనుకు పట్టుకువెళ్లు. లే, వెళ్ళు" అని పలికాడు. 'ఆఁ—కల నమ్మేదేమిటి' అని తలచి లక్ష్యంచెయ్యకుండా పక్కకు ఒత్తిగిలి మళ్లీ పడుకున్నాను.

"అప్పుడు రామచంద్రప్రభు మళ్ళీ దర్శనమిచ్చి,—"ఓరీ! ఏమిరా! త్వరగా లేచి, నేనుచెప్పినట్టు చేయవేమిరా?"

అని నన్ను పొడిచి లేపినట్లయింది. ఇక ఉపేక్ష చేయటమెట్లా? పులికిపడి లేచి, గబ గబ పూరీలూ, కూరా తయారుచేసి, ఇంతకు ముందే తయారుచేసి వుంచిన మంచి మిఠాయి, గుమగుమలాడే చల్లటి మంచి తీర్థం, ఒక చిన్నమెత్త పట్టుకొని, వేళమించి పోతుందనే భయంతో పరుగెత్తుకుంటూ ఇక్కడికి వచ్చాను. వచ్చి, నాకు స్వప్నంలో కనపడిన మహానుభావుడవైన నిన్ను దూరం నించే ఆనవాలు పట్టాను. ఎంతమాత్రం పొరపాటులేదు స్వామీ! దయచేసి, వేడి చల్లారక ముందే నేను తెచ్చినవి ఆర గించండి. నన్ను ధన్యుణ్ణి చేయండి. ఎంతో ఆకలితో వున్నారు, ఆలస్యం చేయకండి" అని భక్తిపూర్వకంగా బతిమాలాడు.

వెంటనే స్వామి వెళ్ళి, సంతృప్తిగా భుజించి, కడుపునిండా చల్లని మంచితీర్థం పుచ్చుకొన్నాడు. తరువాత స్వామి ఆ మిఠాయివర్తకునికి కృతజ్ఞత చెప్పబోయే సరికి, అతను "బాబాజీ! వద్దు వద్దు, నాకేమీ వందనం చేయవద్దు. అంతా భగవానుడైన శ్రీరాముని ఆజ్ఞప్రకారం జరిగింది. ఆయనకే నమస్కరించండి" అన్నాడు.

స్వామిని పరిహాసాలుచేసి పరాభవించిన వర్తకుడు పిడుగుపడినవానిలాగా నిశ్చేష్టితు డైనాడు. కొంతసేపటికి స్మృతివచ్చి, బుద్ధి తెచ్చుకుని పశ్చాత్తాపంతో "స్వామీ! క్షమించు" మంటూ వివేకానందుని పాదాలపై పడి, పాదరజం తీసి బొట్టు పెట్టుకొన్నాడు.

అప్పుడు స్వామి కన్నులవెంట భక్తి బాష్పాలు కాలువలుగా ప్రవహింపజొచ్చినై. ఆయన తన జీవితంలో ఒక గొప్ప సంశయం తీరినట్టుగా ఆనందభరితుడై కనిపించాడు. మనస్సులో "రామా! సుగుణాభిరామా! కారుణ్యసీమా! ఏ కాలమందునా నిన్ను నమ్మి చెడినవారు లేరుకదా!" అని అను కొనివుంటాడు స్వామి!



# లయకారునకును హక్కేది?

-జి. రంగరావు-



శాక్యదేశపు భూపాలుండగు
శుద్ధోధన మహరాజునకు
సిద్ధార్థుండను నొక కొడుకు.
మనిషి మెత్తనే కాకుండా – నుతి
మెత్తని చిత్తము అతనిది.
కష్టము లెన్నడు పడలేదు
కంటితొనైనా కనలేదు.
జీవహింస తా చేయకను
చేసేవారిని మానుమను.
ఒకనా డాతడు ఒంటరిగా
తోటకు పోయి తాపీగా
ఆలోచించుచు కూర్చుండె.
అంతలొ నేదో ఒక పక్షి
కాళ్ళముందు వ్రాలిన దొచ్చి
పరీక్షింపగా నా ఫులుగు
రక్తసిక్తమై కానవగు.
'అయ్యో! పాపం, అన్యాయం
ఎవడో దీనికి చూపెట్టి
పడగొట్టాడు ఎక్కెట్టి.'
అనుచు పక్షిని నిమిరాడు
గాయములో మం దెట్టాడు
గుడ్డను తెచ్చి కట్టాడు
భయపడవలదని తట్టాడు.
అంతలోన నొక బంధువుడు
రొప్పుచు రోజుచు వచ్చాడు
బుద్ధుని పక్షితొ చూచాడు
అహంకారముతొ నడిగాడు :
"వింటితొ దీనిని కొట్టాను
వెదకుచు నే నిటు వచ్చాను,
కావున నాదే ఈ పక్షి
మరిమాటాడుము నాకిచ్చి."
పక్షి భయముతో వణకింది
బుద్ధుని మనసు కరగింది.
"ఇవ్వను దీనిని నీ కిపుడు
నా పలననుగాదు ఇంకెపుడు."
బంధువు దానికి కోపించి
పెద్దలందఱను పిలిపించి
సొంతము కథను వినిపించి
"న్యాయము చూడుడు పరికించి
నాది నాకిపుడు యిప్పించి."
అటు రాకొమరుడు, ముందు నుయి
ఇటు బంధువుడు, వెనుక గొయి.
పచ్చివెలగ నడిగొంతుకలో
పడినట్లయ్యెను పెద్దలలో.
ఎటుచెప్పనచో ఏ తప్పొ
చెప్పకపోతే ఏంముప్పొ?
అంతలొ నెవడో ముసిలోడు
ధైర్యముతో నిటు లన్నాడు :
"రాచబంధువు విల్లెట్టి
చంపదలచెగా తలపెట్టె.
రాకొమారుండు దయతలచి
మందువేసి మరి రక్షించె.
కావున బుద్ధుని పక్షి యిది.
లయకారునకును హక్కేది?"
కనుక పాపలూ! అహింసయె
బుద్ధుని మతముకు మూలమయె.




పూర్వకాలమందు ఒకప్పుడు 'ఫిరోజిషా' అనే చక్రవర్తి ఉండేవాడు. ఆయన భార్య పేరు 'గుల్‌నార్'. ఆమె సాటిలేని సౌందర్యవతి. బేగమ్ గుల్‌నార్ సౌందర్యం అటువంటి ఇటువంటిదని నోటిమాటలతో వర్ణించటానికే వీలుకాదు.

గుల్‌నార్‌యొక్క శరీరసౌందర్యమేకాదు, ఆమె విహరించే అంతఃపురంకూడా అతి వైభవంగా, అపరూపంగా ఉండేది. తెల్లటి చలువరాళ్ళతో నిర్మించి, రత్నమణులు పొదిగిన ఆ దివ్యభవనంలో వుండే విలాస వస్తువులూ, హంసతూలికాతల్పాలూ — వాటి శోభ చెప్పతరంకాదు.

ఇంతటి సంపదా వైభవమూ ఉన్నా, గుల్‌నార్‌కు జీవితంలో తృప్తిలేకపోయింది, ఆనందం లేకపోయింది. ఒకరోజున ఆమె చక్కగా అలంకరించుకొన్నది. నిలువుటద్దంలో తన సాటిలేని సౌందర్యాన్ని తనే స్వయంగా చూచుకొన్నది. కాని, యేదో మనసుకు లోటుగా తోచి, అసంతృప్తితో నిరాశతో అలానే శయ్యపైన వాలిపోయింది.

కొంచెంసేపటికల్లా ఫాదుషా లోపలికి చక్కా వచ్చాడు. బేగంను విచారకారణం అడిగాడు. "గుల్నార్! ఎందుకీబెంగ? ఏదైనా సరే కోరుకో. తీర్చటం నా వంతు" అన్నాడు.

భర్త ఇలా అభయం ఈయటంతో, ఆమె మెల్లగా "ఐతే, నన్నుపోలిన సుందరిని మీరెన్నడైనా చూచివున్నారా?" అని అడిగింది. ఈ ప్రశ్నకు ఫాదుషా ఆశ్చర్యపోతూ, "నీకు నీవే సాటి సుందరీ!" అన్నాడు.

అందుకు బేగమ్ "అలాకాదు. నాతో సరిపోల్చదగిన సుందరి మరెవరైనా ఈ భూలోకంలో ఉన్నదేమో స్వయంగా తెలుసుకోవాలి. ఇదే నా కోరిక" అని చెప్పింది.

ఫాదుషా నవ్వుకొన్నాడు. ఏర్పాట్లు చేశాడు. ఆప్రకారం కొద్దిరోజులకల్లా ఎంతో

కె. శకుంతల

మంది యువతులు ఎక్కడెక్కడినుంచో అంతఃపురానికి వచ్చి విడిసారు. వారందరూ స్వర్గలోకంలోని యక్ష కిన్నెర గంధర్వు లనూ, దేవతలనూ మించిన గొప్ప సౌందర్యంతో ప్రకాశిస్తూవున్నారు. అంద రనూ వరసపెట్టి పరీక్షగా చూచింది బేగం. అందరనూ వెళ్ళిపొమ్మంది. మళ్ళీ శయ్యా మందిరంలోకి వెళ్ళి నిలువుటద్దంలో తన రూపం చూచుకొన్నది.

చిరునవ్వు నవ్వుతూ, 'లక్షమంది దేవ తలు రానీ. నా అందానికి ఎవ్వరూ సాటి కారు' అంటూ తనలోతను అనుకొని ఒక విధమైన తృప్తిపొందింది.

ఐతే, ఆ తృప్తి ఐనా ఎంతోకాలం నిలవ లేదు. మళ్ళీ కొన్నాళ్లకే మునపటిలాగా విచారం ముంచుకువచ్చింది.

మళ్ళీ భర్తను అంతఃపురంలోకి పిలి పించుకొని 'చూడండి!—నా హృదయ మింకా ఏమోకాని అసంతృప్తితో తపించి పోతూనేవుంది' అని చెప్పింది. ఆమె విచారం తొలగించలేకపోయాడు బాదుషా.

అంతలో—వసంతకాలం వచ్చింది. మొగ్గలు విడిచినై. వాటిచుట్టూ గండుతుమ్మె దలు 'జుం'మ్మని ధ్వని చేయసాగినై. ఉద్యానవనంలో కోకిలలూ, బుల్‌బుల్ పిట్టలూ మంగళగానం చేస్తున్నయి. బేగం గుల్‌నార్‌కు ఇటువంటి శుభసమయమందు స్త్రీ శిశువు కలిగింది!

శిశువును బేగంయెదుట పెట్టారు చెలి కత్తెలు. ఇప్పుడు మళ్ళీ బేగమ్ భర్తను పిలిపించింది. "ఇప్పుడు తీరింది నా కోరిక! నాకు సాటిఐన సుందరి ఈనాటికి కనిపిం చింది. నా హృదయం తేలికపడింది. నా అందానికి సాటిఐనది ఈ లోకంలో ఈ పాప ఒక్కర్తె!"—అంటూ శిశువును చేరదీసు కొని తనివితీర ముద్దులు పెట్టుకొన్నది.



# నలుమూలల నడకలు

మనదేశంలో వర్తకంచేసే ఒక జర్మనీ దేశస్థుడు గణేశునిగురించి ఒక హిందువునితో పరిహాసంగా ప్రసంగిస్తూ, "ఇటువంటి ఎలుక స్వామిని పూజించటం నామోషీ కాదటయ్యా ?" అన్నాడు.

అందుకు హిందువు : "మా గణేశుని ఏనుగుతల బుద్ధిబలాన్నీ, ఔదార్యాన్నీ, హుందానూ సూచిస్తుంది. పోతే రహస్య సారంగాలు తవ్వటం-తవ్వి, ఇతరుల ఆస్తులను దొంగిలించుకపోవటం—పోయి, అదంతా పోగేసుకోవటం—ఇటువంటి కృత్యాలన్నీ నాకు తెలుసును సుమా ! అని చెప్పటానికే ఎలుకను వాహనంగా చేసుకొన్నాడు గణపతి" అని బదులు చెప్పాడు. జర్మనీ వాడు తల వంచుకొన్నాడు.

—•—

ఒకదేశంలో బస్సులు మూడు తరగతులుగా వుండేవి. ఒకనాడు దారిలో బస్సు చెడిపోయింది. అప్పుడు కండక్టరు ఇలా కేకవేశాడు : "మొదటి తరగతి ప్యాసెంజర్లు కదలక మెదలక కూర్చోండి. రెండవ తరగతి ప్యాసెంజర్లు దిగి, కారువెంబడే నడవండి. మూడో తరగతి ప్యాసెంజర్లు దిగి కారును తోయండి !"

ఇద్దరు ప్రాణమిత్రుల మధ్యని ఒకప్పుడు చిన్న పేచీపడింది. అది వృద్ధి అయి, చివరకు ఉభయులూ మాటాడుకోవటమే మానివేశారు. ఇది బాగా లేదని, వారిద్దరికీ కావలసిన స్నేహితులు మళ్ళీ మాటలుకలిపారు. ఇందుకు అందరూ సంతోషించారు. ఒక రోజున ఒక మిత్రుడు వెళ్ళి అందులో ఒకనిని అభినందించబోయాడు. ఇందుకు అతడు ఇలా బదులు చెప్పాడు : 'మొదట్లో మేమిద్దరమూ ఒకేఒక దారంలాగా ఉండేవాళ్ళం. హాయిగా వుండేది. ఇప్పుడు మీరందరూ చేరి, అతని దారపుముక్కనూ నా దారపు ముక్కనూ కలిపి ముడివేశారు. అప్పటప్పట ఆ ముడి అడ్డువస్తూ వుండటం చేత, మొదటో వుండేటంతటి హాయి ఇప్పుడు లేకుండాపోయింది. అతుకు అతుకే !'

—•—

ఒకవూరిలో ఒకప్పుడు దొంగల భయం ఎక్కువయింది. ఎవళ్లకూ కంటిమీద కునుకు లేకపోయింది. కాని, నిశ్చింతగాగుర్రుపట్టి నిద్రిస్తున్నవాడు ఒక్కడే కనబడ్డాడు—వాడే కుమ్మరి !




మేవార్ రాజ్యాన్ని సంగ్రామసింగు పరిపాలిస్తున్న సమయం. రాణాకు నమ్మిన బంటు వనవీరుడు. వనవీరుణ్ణి రాణా నమ్మి ఉండడం మాత్రమేకాదు, ప్రాణసమానమైన రాజ్యాంగవిషయాలన్నీ వనవీరునికి వప్పగించివేశాడు. పైగా, వానిని ప్రధానమంత్రిగా చేశాడు.

వనవీరుడు పేదరాలైన ఒకానొక దాది కొడుకు. ఆస్థానంలో పుట్టి పెరిగినవాడు కావటంచేత, గుట్టుమట్టులన్నీ ఇట్టె తెలుసుకోగలడు. పైగా రాజ కుటుంబంలో తలలో నాలుకగా మసులుకోవటంచేత రాణా ఇష్టులలో ముఖ్యుడైనాడు.

ముఖ్యుడు కావటం బాగానేవుంది. కాని, మొదటినుంచీ వనవీరుడు దురుద్దేశాలతోనే ఉంటూ వచ్చాడు. 'సంగ్రామసింగుకు వృద్ధాప్యం వచ్చింది. ఇకెంతకాలం జీవించబోతాడు? ఎట్లాఐనా ఈ రాజ్యం మనం కాజేయాలి!' అనే సంకల్పం చిన్ననాటి నుండీ వనవీరుని హృదయంలో మొలకెత్తుతూనేవుంది. రాణా తనను నమ్మడం, నమ్మి ప్రధాన మంత్రిగా చేయటం—ఈ ఘట్టాలు నిమ్మకు నీరుపోసినట్టు వనవీరుని సంకల్పానికి బలం చేకూర్చినై.

తనకు కాలం సమీపించిందని గ్రహించిన రాణా, వనవీరుణ్ణి చేరబిలిచాడు: 'వనవీర్! ఇంతవరకు నీవు నాకు చేదోడుగా ఉన్నావు. అంతటితో తీరలేదు. నీవల్ల మా కుటుంబానికి జరగవలిసిన ఉపకృతిఅంతా ముందే వున్నది. ఇదుగో, నా చిన్నారి ఉదయసింగును నీ చేతులలో పెడుతున్నాను. వీనికి సమస్తమూ నీవే. ఈ ఆరేళ్ళ నిసుగును ఎలా కాపాడుకుంటావో!' అంటూ బిడ్డడిని వప్పగించి కన్నుమూశాడు.

కోటలో పాగా వేసినందుకు వనవీరుడు ఉప్పొంగిపోయాడు.

ఎం. ఎస్. శాస్త్రి





కుటుంబమంటే వల్లమాలిన అభిమానం. అందులోనూ ఉదయసింగుపైన ఆమెకు పంచప్రాణాలున్నూ. ఇందుకూ ఒక కారణ మున్నది: పన్నాకు కడుపున పుట్టిన కొడుకూ, చిన్నరాణా ఉదయసింగూ ఒక్క యీడు వాళ్ళు. కొడుకుతోపాటు ఉదయసింగుకు కూడా పాలిచ్చి పెంచుకొంటున్నది ఆమె. కాలం బాగానే సాగిపోతున్నది.

ఐతే-చిన్నవాడైన ఉదయసింగు ఉండగా తనకోరిక నెరవేరటానికి అవకాశం లేదను కొన్నాడు వనవీరుడు.

పసివాణ్ణి పరిమార్చటానికే నిశ్చయం చేసుకొన్నాడు. ఇది రెండవకంటివానికి తెలియకూడదు. అందుకని తన చేతులతో తనే వానిని ఖండించటానికి రహస్యమైన ఏర్పాటు ఆలోచించాడు.

ఇటువంటి గుట్టును వెల్లడించటానికి తగిన నమ్మకస్థుడు ఒక్కడే వున్నాడు. వాడే 'వారి' అనే మంగలి. 'వారి'కి చెప్పిపెట్టాడు వనవీరుడు — ఉదయ సింగు నిద్రపోయేటప్పుడు తగిన సమయం చూచి చెప్పమని. 'సరే' నన్నాడు వారి.

ఐతే,—అధికారిమాట కాదనలేక సరే నన్నాడేకాని, ఆ క్షణంనించీ ఆలోచనలో పడ్డాడు వాడు. మేవార్ కుటుంబానికి

రాణా గతించినప్పటినుండీ వనవీరుడే ఉదయసింగుకు రక్షకుడయ్యాడు! ఐతే రక్షకుడైన క్షణంనుంచీ వనవీరుడు ఆకాశానికి నిచ్చెనలు వేయసాగాడు. ఏనాటికైనా మేవార్‌కు తనే రాజు కావాలెనని కాంక్ష. ఈ కాంక్ష నెరవేరేటందుకు వనవీరుడు ఎన్ని వ్యూహాలైనా పన్నాడు.

పాలు కుడిచే పసిపాపడు—ఉదయ సింగుకేమి తెలుసు ఈ మంత్రాంగమంతా? ఉదయసింగు ఒక దాది పోషణలో వున్నాడు. ఆ దాదిపేరు పన్నా. పన్నా ఒక రాజపుత్రవనిత. మేవార్ ప్రభువుల ఉప్పు తిని పెరిగింది. అందుచేతనే ఆమెకు రాణా





హితవుకోరే 'వారి'కి గుండె బెదురుపట్టుకున్నది. 'రాజకుటుంబానికి ఇటువంటి విపత్తు సంభవించడమేమిటి? ఈ అకార్యంలో నేను నియమింపబడడమేమిటి?' అని తీవ్రమైన జిజ్ఞాస కలిగింది.

వనవీరుడికి దుష్టచింత కలిగినప్పటి నించీ రాజపుత్రుని ఉనికి ఉద్యానవనంలోని దివ్యభవనంలో యేర్పాటుచేశాడు. ఇలా చేయటంతో తన సంకల్పం సుకరంగా నెరవేర్చుకోవచ్చునని అతని నమ్మకం.

ఒక అమావాస్యరాత్రి 'వారి' ఆ దివ్య భవనంలోపలకు వెళ్ళాడు. పన్నా ఎదుట నిలబడ్డాడు. నిలబడ్డాడేకాని, నిలువునా కంపించిపోతున్నాడు. అప్పుడే పన్నా బిడ్డల నిద్దరినీ నిద్రపుచ్చివచ్చి ఇవతలకూర్చున్నది. కూర్చునివున్న పన్నా 'వారి' కంటబడటంతోనే కంగారుపడి లేచింది.

"ఇప్పుడొచ్చావేం వారీ?" అని ఆత్రంతో అడిగింది.

"ఏమని చెప్పేది...పన్నా! మన బాబు ప్రాణానికే వచ్చింది మోసం. కాస్సేపట్లో వస్తున్నాడు దుర్మార్గుడు...కత్తిపట్టుకుని..." అన్నాడు. మరి చెప్పలేకపోయాడు.

"హా, బిడ్డా!—" అంటూ పెద్దగా నిట్టూర్చి పడిపోయింది పన్నా.



వారీ ఆమెను లేవదీశాడు. "పన్నా!- దుఃఖానికి సమయం కాదిది. మన బాబును మనం రక్షించుకోవాలి. ఈ సంగతి ఆలోచించు ముందు. వచ్చేస్తున్నాడు కాలయముడు!—" అంటూ వాపోయాడు.

తృటికాలం యోచించింది పన్నా.

అంతలోనే మెరపు మెరసినట్టు ఆమె ముఖం వికసించింది. తక్షణమే పన్నా నిద్రిస్తున్న బిడ్డలవద్దకు వెళ్ళింది. తన కొడుకు చింకిగుడ్డలు తీసి రాజపుత్రునికి తొడిగింది. గబగబ ఒక పాతగుడ్డల బుట్టలో పసివాణ్ణి పడుకోబెట్టి, వారీ నెత్తిపైన పెట్టింది. "వారీ!- ఈ బుట్టలో వున్నాడు



"బిడ్డా, బంగారుకొండా!—మేవారు ప్రభువుల సొమ్ముతో పెరిగింది ఈ నా శరీరం. రాజపుత్రుని రక్షించవలసిన బాధ్యత పైన పడింది. ఇందుకోసం నిన్ను—నా ముద్దుల మూటవైన నిన్ను-బలిచెయ్యవలసి వచ్చింది తండ్రీ!—కనుగందువైతేనేమి, నీవు ధన్యుడవు! నీ ఒంటి రక్తధారలతో మేవార్ రాజ్యం చిగురులు తొడగబోతున్నది!—" అంటూ జలజల కన్నీళ్ళు రాల్చింది. మళ్లీ బిడ్డను పడుకోబెట్టి, ఆ క్షణం ఎప్పుడా ఎప్పుడా అని నిరీక్షింపసాగింది.

అర్ధరాత్రి. కటికచీకటి. వనవీరుడు రానేవచ్చాడు. మర్యాదకోసం పన్నా ఒసిలి నించున్నది.

బిడ్డకు దగ్గరగా వెళ్ళాడు వనవీరుడు. "పన్నా!—రాజపుత్రుడు క్షేమమా?" అంటూ కుశలప్రశ్న వేశాడు. పన్నాకు నోట మాట పెగిలిందికాదు.

ప్రళయభయంకరుడూ, నిర్దయుడు ఐన వనవీరుడు బాకుదూసి బిడ్డడిని ఒక్కపోటు పొడిచాడు! కెవ్వుమని ఒక్క కేకవేసి, పసివాడు దివిచేరుకొన్నాడు!!

పిట్టకు తెలియకుండా పారిపోయాడు వనవీరుడు. పసివాడు వేసిన కేకకు పరుగు లెత్తుకొంటూ వచ్చారు ప్రజ. ఏముంది?—

మన బాబు. తిన్నగా పట్టుకువెళ్ళి ఫలానా పూరిలో 'అరహర్' అనే వర్తకునికి అందజెయ్యి. అతను బాబును భద్రంగా పెంచుతాడు" అని వేగిరపెట్టి పంపించింది.

వారీ వెళ్ళిపోగానే రాజపుత్రుని దుస్తులు తన కొడుకునకు కట్టబెట్టింది పన్నా. "ఎవరైనా రానీ ఇంక! ఏమైనా చేయనీ!! రాణాల సొమ్ము తిన్నందుకు రాజపుత్రుని ప్రాణం కాపాడగలిగాను. నా ఋణం తీరిపోయింది" అనుకొన్నది.

తల్లి ప్రాణం ఉండబట్టిందికాదు. రాజపుత్రుని దుస్తులతో వున్న తన బిడ్డను, పన్నా ఒడిలోకి తీసుకున్నది.

కన్నులు మణిగిపోయేటటువంటి నెత్తురు కొలను! నెత్తురు కొలనులో స్మృతితప్పి పడి, పొర్లాడుతున్న పన్నా!!

ఉపచారాలు చేశారు. తేరుకొన్నది ఆమె. 'ఇదంతా ఏమిటి?'అని గుచ్చిగుచ్చి అడిగారు అందరూ.

గొప్ప అంతస్సుగల పన్నా కాస్తం తయినా తెలియనీయలేదు. ఏమీ?–ఆమెకు కావలసింది రాజపుత్రుని రక్షించటమే కాని, వనవీరునిమీద కసితీర్చుకోవటం కాదు. 'చెప్పతే...'నన్నది.

ఈ వార్త నగరమంతటా అల్లుకొన్నది. పన్నా సితికి అందరూ పరితపించారు. గుట్టు బయటపడుతుందనే బిడియంతో, పన్నాను పట్నంబయటికే పంపించివేశాడు వనవీరుడు.

ఏమైతేనేమి?-రాజపుత్రుడు అక్కడ వర్త కుని యింటిలో సురక్షితంగా పెరుగుతూనే ఉన్నాడు. మేవార్‌నుండి పంపివేయబడిన పన్నా మళ్లీ ఆ వర్తకుని యింటిలోనే పనికి కుదురుకొన్నది. అక్కడ మళ్ళీ తన చేతులతో తను రాజపుత్రుని పెంచుకునే అవకాశం కలిగింది. ఈ సంఘటనలు పన్నాకు ఎంతో తృప్తిని కలిగించినై.

మరికొద్ది కాలానికే వనవీరునికి పాపం బద్దలయింది. వాడు చేసిన వ్యూహం వెల్లడైంది. ప్రజలు తిరుగుబాటు చేశారు. వానిని ఉరితీసి చంపారు.

తరువాత పన్నాచేతిలో పెరిగిన ఉదయ సింగే గద్దెయెక్కాడు. జీవితాంతంవరకూ పన్నా, మహారాణా ఉదయసింగును కని పెట్టుకొనే వున్నది.

సాటిలేని త్యాగంచూపిన పన్నా పవిత్ర నామం మేవార్ రాజ్యచరిత్రలో స్వర్ణాక్ష రాలతో లిఖింపబడి, నేటికీ స్మరింప బడుతూనేవుంది.






పూర్వకాలమందు కాశ్మీరుదేశానికి యశస్కరుడు ప్రభువుగా ఉండేవాడు. ధర్మబద్ధమైన తీర్పులు చెప్పటానికి ఆయన పేరుపొందాడు.

ఆ కాలంలో, బ్రాహ్మలెవరికైనా అన్యాయం జరిగితే, వారు కోటకు వచ్చి ప్రాయోపవేశం చేసేవారు. అదిచూచి, రాజు వెంటనే వచ్చి కనుక్కొని పరిష్కరించి, మరీ ఇంకొక పనికి వెళ్ళేవాడు.

ఒకనాడు ఒక బ్రాహ్మడు వచ్చాడు. తీరా రాజు భోజనానికి కూర్చోబోతున్నాడు. ఐనా, గభీమని లేచివచ్చి, 'మీ ఫిర్యాదు ఏమిటో చెప్పండి' అన్నాడు.

అందుకా బ్రాహ్మడు—"మహారాజా! నేను దేశదేశాలూ తిరిగి నూరు బంగారు నాణాలు సంపాయించుకున్నాను. ఇప్పుడు పరిపాలన బాగా ఉన్నదని విని, జన్మభూమికి తిరిగివస్తున్నాను. దారిలో ఎక్కడా దొంగల భయం అన్నమాటలేదు. చాలా ఆనందంగా వస్తున్నాను. నిన్న సాయంకాలానికి 'లవణోత్స' గ్రామానికి చేరుకున్నాను. అలసి, ఒక చెట్టుక్రింద పడుకున్నాను. ఈ బంగారు నాణాలున్న సంచీ నా నడుముకు కట్టుకునే పడుకున్నాను.

"ప్రొద్దున్నే లేచి చూచుకొందామంటే సంచిజారి నాణాలన్నీ పడిపోయినై. పక్కనే నేలనుయ్యి ఒకటి ఉంది. దాన్ని నేను చూడనేలేదు. ఈ బంగారు నాణాలన్నీ ఆ నూతులో పడిపోయాయి. నేను ఆ నూతిలోనే పడి చావటానికి నిశ్చయించుకోగా, నా ఏడుపు విని నలువైపులనుంచీ లవణోత్స గ్రామ ప్రజలు పరుగెత్తుకు వచ్చారు. నూతిలో పడకుండా వాళ్ళు నన్ను పట్టుకున్నారు.

అప్పుడు వారిలో ఒక ధైర్యశాలి 'నూతిలో పడిన నీ నాణాలన్నీ తీసియిస్తే

ఎన్. హనుమయ్య

నాకేమిస్తావు?' అని అడిగాడు. నేనప్పుడు చాలా విచారంలో ఉన్నాను. నా మనస్సేమీ బాగాలేదు. "అయ్యో, నా ధనమంతా ఎటూ పోనేపోయిందికదా! మీరు దాన్ని పైకి తీయగలిగితే-మీకు ఇష్టంవచ్చినంత సొమ్ము నాకు ఇవ్వండి" అన్నాను.

వెంటనే అతడు నూతిలో దిగాడు. అందులో పడిన నాణాలు తీసుకుని కాస్సేపట్లో పైకి వచ్చాడు. "నువ్వు నా యిష్ట ప్రకారం ఇచ్చినవి తీసుకుంటానని అన్నావు కదా! నాయిష్టప్రకారం నువ్వు రెండు నాణాలు తీసుకో. మిగిలిన తొంభైయెనిమిది నాణాలు నేను తీసుకుంటున్నాను" అని చెప్పి, అతడు రెండు నాణాలు మాత్రమే నాకు యిచ్చి, మిగిలిన సొమ్మంతా తను తీసుకొన్నాడు. ఈ పద్ధతి బాగులేదని నేను వాదించాను. కాని అక్కడ చేరినవారంతా నన్నే నిందిస్తూ-"యశస్కరుని రాజ్యంలో పత్రమెంతో మాటా అంతే. నీ మాట ప్రకారమేకదా చేశాడతడు. కనుక నువ్వేమీ అడ్డుచెప్పటానికి వీల్లేదు" అన్నారు.

ఇలా బ్రాహ్మడు జరిగిందంతా చెప్పి, "మహారాజా! నేను మంచివుద్దేశంతో అన్న మాటకు విపరీతార్థం తీసి, నేను కష్టపడి సంపాదించుకున్న ధనాన్ని అపహరించారు.



దీనికంతకీ మీ విచారణపద్ధతే కారణమను కున్నాను. ఇప్పుడు ఈ ఫిర్యాదు విచారణ జరపమని కోరుతూ, ఇదుగో ప్రాయోపవేశం చేస్తున్నా" అన్నాడు.

'ఆ సొమ్ము అపహరించినవాని కులమూ, పేరూ తెలుసా?' అని అడిగాడు యశస్కరుడు. 'అవేమీ నాకు తెలియవు ప్రభూ! ముఖం చూస్తేమాత్రం గుర్తుపట్టగల' నన్నాడు బ్రాహ్మడు.

మరునాడు రాజుగారి భటులు పోయి లవణోత్స గ్రామంలోని జనాన్ని అందరినీ పిలుచుకువచ్చారు. రాజుగారి ఆజ్ఞప్రకారం బ్రాహ్మడు తనసొమ్ము అపహరించినటువంటి

వ్యక్తిని గుర్తుపట్టి చూపించాడు. ఏం జరిగిందీ వివరంగా చెప్పమని యశస్కరుడు ఆ వ్యక్తిని అడిగాడు. రాజుగారితో బ్రాహ్మడు ఏంచెప్పాడో సరీగా అలాగే చెప్పాడు ఆ వ్యక్తి. చివరని "ప్రభూ! నేను బ్రాహ్మడి మాటప్రకారమే చేశానుసుమండీ!" అని మళ్ళీ ఉటంకించాడు.

ఇదంతా విని, అక్కడ చేరినవారందరూ ఆ వ్యక్తి అపరాధమేమిటో నిర్ణయించలేక పోయారు. వాళ్లంతా రాజుగారి తీర్పు వినటానికి కుతూహలపడసాగారు.

ఇద్దరు చెప్పిన సంగతులూ విని రాజు కాస్సేపు ఊరుకుని, తరువాత తీర్పు చెప్పాడు: 'అసలు, ఆ సొమ్ముకు యజమాని అయిన బ్రాహ్మడు తొంభైయెనిమిది బంగారునాణాలూ, వాటిని నూతిలోనించి పైకి తీసిన వ్యక్తి రెండు బంగారునాణాలూ తీసుకోవాలి' అని చెప్పాడు. ఇది విని అందరూ తెల్లబోయారు.

యశస్కరుడు అందరికీ తెలిసేటట్లు ఇలా చెప్పాడు: "బ్రాహ్మడు 'నీ ఇష్టంవచ్చినంతసొమ్ము నాకు ఇవ్వ'మనికదా అన్నాడు. అంటే తనకు ఎంతయివ్వటం ఉచితమో, అంత ఇవ్వమని బ్రాహ్మణుని ఉద్దేశం. నూతిలోనుంచి ఈ సొమ్ము పైకితీసిన శ్రమకు ప్రతిఫలంగా తొంభైయెనిమిది నాణాలు ఇవ్వవలసివుంటుంది అని అనుకుని అతడు ఇలా అనలేదు. కనుక బ్రాహ్మడు 'పైకి అన్నమాట ప్రకారం' ఇతడు యిలా చేశాడుకాని, అతడి 'మనస్సులో వున్న మాట'ప్రకారం కాదు. ధర్మాధర్మాలను మనస్సులో వుంచుకుని, బ్రాహ్మణుని అసలు వుద్దేశం ఏమిటో కూడా గ్రహిస్తే, రెండునాణాలుమాత్రమే ఇతడు తీసుకోవచ్చు. మిగిలిన తొంభైయెనిమిది నాణాలు బ్రాహ్మణుడివే..."

ఇలా చెప్పిన యశస్కరుని ధర్మసూక్ష్మానికి అందరూ ఆశ్చర్యపోయారు.



# రంగులబొమ్మ కథ - 3

ఆ అలజడి, రాక్షసరాజయినటువంటి జ్వాలాముఖుడిదే. ఉరకలు వేసుకొంటూ, రంకెలు వేసుకొంటూ, భోజనాల గది ప్రవేశించాడు వాడు.

'ఎక్కడెక్కడ? నరుడు—ఖలుడు! ఏడీ—ఏడీ, ఆ దుర్మార్గుడు?' అంటూ గదిఅంతా కలయతిరిగి, గందరగోళం చేయసాగాడు. ఈ గడబిడ చూచి వాడి భార్య "రావయ్యా, ఎప్పుడూ ఇదే గొడవ! నరుడూ లేదూ గిరుడూ లేదూ" అని గట్టిగా మందలించింది. అప్పుడు ఆమె పెట్టినట్టుగా భోజనంచేసి లేచాడు.

లేవగానే "ఏదీ, నా బంగారు కోడీ?" అని కేకవేశాడు.

అందాలుచిందేటి ఒక కోడిపెట్టను తెచ్చి భర్త ఎదుట బల్లమీద పెట్టిందామె. ఇదంతా వేయికన్నులతో కనిపెట్టి చూస్తూనేవున్నాడు, గంగన్న.

"పెట్టూ గ్రుడ్డు!—ఒకటీ... రెండూ..." అని గద్దించాడు రాక్షసుడు. ఈ మాట అంటూవుండగానే బల్లమీద, ఒక బంగారుగ్రుడ్డు పెట్టింది ఆ కోడి.

ఎంతో ఉత్సాహంతో వాడు గబగబ అంకెలు లెక్కిస్తూనేవున్నాడు. ఆ అంకెలప్రకారం లెక్క తప్పిపోకుండా బంగారుగ్రుడ్లు పెడుతూనేవుంది ఆ బంగరుకోడి. ఈవిధంగా అది పెట్టిన గ్రుడ్లు ఒక పెద్దప్రోగుగా పడివున్నయి. ఈ పోగు చూస్తూనే ఎంతో ఆనందంపొంది, జ్వాలాముఖుడు తన కుర్చీలో అలానే నిద్రపోయాడు! వాడు నిద్రిస్తూవున్న సమయంలో చల్లగా మెల్లగా లేచాడు గంగన్న. రెండవకంట పడకుండా రాక్షసుని బల్లపద్దకు చేరుకొన్నాడు. బంగారుకోడిని చేపట్టాడు. కోట - దాటి క్షణంలో ఉడాయించాడు!

అక్కడ—గంగన్న తల్లి కొడుకుకోసం కనిపెట్టుకొని కూచుంది. గంగన్న కంటపడేసరికి మామూలుధోరణిలో సణగటం ప్రారంభించింది. కాని, కుర్రవాడు తెచ్చిన కోడిపెట్టను కంటబెట్టగానే ఆమె సంతోషానికి మేరలేకపోయింది. ఇప్పుడు కోడినిగురించిన కీలకం తెలుసుగనుక, గంగన్న, దానిచేత బంగారు గ్రుడ్లు పెట్టించి, అవి అమ్ముకువచ్చి, తనూ తల్లీ సుఖంగా ఉంటూవచ్చారు.

ఐతే, ఆనాడు తనను దాచిపెట్టిన అప్సరస, చెప్పిన మాటలుమాత్రం గంగన్న మరచిపోలేదు. దుష్టుడైన ఈ జ్వాలాముఖుడి పీడ ఎలా వదల్చటమా? ఎలా భూభారం తగ్గించటమా? అనే, ఎల్లప్పుడూ మనస్సులో ఆలోచిస్తూనే ఉండేవాడు.

# డబ్బుదెయ్యం

కోరుకొండరాజ్యానికి కోనేటి తిమ్మరాజు గారు అధిపతి. ఆయననెరదాతా, దయా మయుడున్ను. తన ఆస్థానంలో పనిచేసే మంత్రులకూ సేనాపతులకే గాక, దాసదాసీ జనానికిసైతం ఆయన పుష్కలంగా ముట్ట జెప్పేవాడు.

అలాటి ధర్మపరుడైన తిమ్మరాజుగారి కొలువులో ముత్తయ్యా ఒక నవుకరు. ముత్తయ్యకు పిల్లా జెల్లా ఎవరూలేరు. తనూ, భార్యా—అంతే. చేతినిండుగా ప్రభువులు డబ్బిచ్చినా, దానిని అనుభవించక, వాడు కడుపుకట్టుకొని డబ్బు వెనకేసేవాడు.

తిమ్మరాజుగారి రాజ్యంలో రాగినాణాలు లేవు సరికదా, వెండినాణాలైనా చాలా అరుదు. అక్కడ నవుకర్లందరకూ బంగారు నాణాలే బట్వాడా. తనవంతువచ్చే బంగారు నాణాలను ముత్తయ్యా పోగేసి ప్రాణప్రదంగా దాచుకొనేవాడు. ఇలా పోగెయ్యటమే వాడికి ఆనందం. అదొక అలవాటు. ఇందులో వాడి భార్య మరిడమ్మకూడా భర్తకు తోడుపడేది.

నిత్యావసరాలకైనా నాలుగు నాణాలు తీసి కర్చుపెట్టడమంటే ఆ భార్యా భర్తలకు ప్రాణంపోయినట్టుగా వుండేది. రోజూ రాత్రిళ్ళు వాళ్ళు మూటకట్టివుంచిన ధనం బయటికి తీసి, విప్పిచూచి లెక్కపెట్టి, మళ్లీ జాగర్తగా దాచేసేవాళ్లు. అలా లెక్కచూచి నప్పుడు వాళ్ళు 'అయ్యో!—ఇవాళ రెండు మొహిరీలు కర్చుపెట్టవలసివచ్చిందే! ఎంత ధనం తరిగిపోయిందో?' అని ఒక్కొక్క షూరు విచారించేవాళ్ళు.

ఇలావుండగా ముత్తయ్యకు ఒకసారి ఒక చక్కటి ఆలోచన తట్టింది. వెంటనే భార్యను పిలిచాడు. "ఓసీ, ఓసీ!— నేను చెప్పినట్టు చేస్తివా, అమాంతం మనం బంగారుగోడలూ మేడలూ కట్టెయ్యవచ్చు!"

కుమారి సి. జానకి





అన్నాడు. ఈ మాటకు మరిడమ్మ వళ్ళు పులకరించింది. అదేమిటో చెప్పమని కూర్చుంది.

అప్పుడు ముత్తయ్య "మరేమీలేదు. నేను నాలుగురోజులపాటు ఊరుదాటి అవతలకు పోతాను. నువు మనవూళ్లో ధనవంతులందరిదగ్గరకూ పోయి, విచారం నటిస్తూ, "నా భర్తను రాజావారు ఖైదు వేశారు. నాది ఒంటిపాటు బతుకైపోయింది. ఆడకూతురను. దిక్కు లేకపాయె!" అని చెప్పు. ఏంజరుగుతుందో చూడు" అన్నాడు.

అనుకొన్న ప్రకారం, మరునాడు ఉదయమే ఊరు దాటి ముత్తయ్య ఎక్కడికో వెళ్ళిపోయాడు. మరిడమ్మ ఊరిలోని ధనవంతులదగ్గరకు పోయి భర్త చెప్పినట్టుగానే పాఠం ప్రారంభించింది. ఇంతకు ముందెప్పుడూరాని ఆమె తమవద్దకు వచ్చేసరికి, వర్తకులు జాలిపడి ఎవళ్ళకు తోచింది వాళ్ళు తలాకొంతా సాయంచేశారు.

కష్టపడకుండా ఇలా కాలక్షేపం జరిగిపోవటం చూడగా, మరిడమ్మకు ఇదే బాగున్నదనిపించింది. ఐతే, ఒకసారి ఇచ్చినవాళ్లదగ్గరకు మళ్ళీ ఏ ముఖం పెట్టుకు వెళ్లటం? ఎంత ధనవంతులైతే మట్టుకు హద్దూ పద్దూ లేకుండా ఎంత కాలమని సాయపడతారు? ఇప్పటికి ఊరిలో ధనవంతులందరినీ చూడటం, మరిడమ్మ సాయంపొందటం జరిగిపోయింది. ఇంక ఒక్కళ్ళూ మిగలలేదు.

ఈ స్థితిలో ముత్తయ్య ఇంటికి చేరుకొన్నాడు. పరిస్థితి గమనించాడు. తన పాచిక పారినందుకు చాలా సంతోషించాడు. ఇలా ధనవంతులవద్దనుండి పోగుచేసిన సొమ్ముతో కొన్నాళ్ళు వాళ్లు కాలక్షేపంచేసి, కొంతసొమ్ము మిగుల్చుకున్నారు.

"బాగానే వుంది. మళ్ళీ నేను కొంత కాలం ఊరికి పోతాను. మునపటిలాగానే.." అన్నాడు ముత్తయ్య.





అందుకు మరిడమ్మ "నేను పోను. మళ్ళీవెళితే మన గుట్టు కాస్తా బయల్పడి పోతుంది. తొలిసారే కొంతమంది నామీద విసుక్కున్నారు. 'అంత జరక్క పోతే చుట్టాల వద్దకు పోరాదా? ఎన్నాళ్లని మేం తేరమేప గలం?' అనేశారుకూడా" అన్నది.

"భేష్, ఇంకేం!—మనకు మంచి ఉపాయం ఆ ధర్మాత్ములే చెప్పారు. నేను ఇవాళనే బయలుదేరిపోతా. నువ్వు, మన బంధువర్గం ఈ చుట్టుపక్కల ఎక్కడెక్కడ వున్నారో జ్ఞాపకంతెచ్చుకుని, వాళ్ళందరి దగ్గరా డబ్బు గుంజుకురా, పో!" అని చెప్పి ఆనాడే బయలుదేరి పోయాడు.

చుట్టుపక్కల చుట్టాలను తెలిసినంత వరకు జ్ఞాపకంచేసుకొని పోయి, మరిడమ్మ తన దుస్థితి వలపోసుకొన్నది. ఆమెను చూడటంతోనే వాళ్లందరూ జాలిపడ్డారు. ఓదార్చారు. తలకొక రోజూ వంతులువేసు కొని ఆమెను ఆదరించి, సుష్టుగా భోజనాలు పెట్టి, వెళ్లేటప్పుడు తమకు కలిగినదానిలో ఏదో ఇంతయిచ్చి మరీ పంపారు. ఈవిధంగా కొన్నాళ్లపాటు బంధువర్గమంతా మరిడమ్మను పోషించటం జరిగింది. మరి కొద్దిరోజు లుండేటప్పటికి వాళ్లకూ ఆమెపైన రోత పుట్టింది. మొదట్లోఅయితే ఆమె మాటలు నమ్మారుకాని, రానురాను ఇదంతా ఏమిటా అని అనుమానపడసాగారు.

ఇటువంటి పరిస్థితిలో మరిడమ్మ ఇల్లు చేరుకుంది. మరి కొద్దిరోజులకే ముత్తయ్య చక్కావచ్చాడు. ముత్తయ్య ఎంతో ఉత్సాహంతో ప్రసంగం ప్రారంభించాడు. కాని, మరిడమ్మ వైరాగ్యభావంతో అతని మాట లన్నీ తుంచేస్తూవచ్చింది. ఇది చూచి, ముత్తయ్య "ఓసీ, ఇంతమాత్రానికే దిగాలు పడిపోవటమేమిటి? ఇంక నువు ఇల్లు కదలబోకు. మనం ఐశ్వర్యవంతులం అయే మార్గం నేనే చూస్తా!" అన్నాడు ధీమాగా. ఆమె ఊరుకొన్నది.



అనాటిరాత్రి ఎక్కడినుంచి తెచ్చాడో, ఎలా తెచ్చాడో, ఒక మంచిముత్యం చేత పట్టుకవచ్చాడు. మరునాడు మరొకటి. మూడవ రోజున ఇంకొకటి. ఇవాళ ముత్యం, రేపు పగడం, ఎల్లుండి నీలం-ఇలా, రోజుకొకరకం దినుసు - అపూర్వమైనది - విలువకట్టలేనిది—తీసుకరావటం మామూలైంది. మరిడమ్మకు ఇదంతా ఏమీ బోధపడలేదు.

రోజూ రాత్రిళ్ళు పచ్చేటప్పుడు ముత్తయ్య ఏదోవక వస్తువు తెస్తూనేఉండేవాడు. ఇలా తెచ్చినవాటిని క్రమంగా వర్తకులవద్ద అమ్మజూపుతూవచ్చారు. ఒక రోజున ఆ దంపతులు ఒక నీలం పట్టుకపోయి అమ్మకం చూపేసరికి, తలవని తలంపుగా రాజభటులు వాళ్ళనుపట్టి బంధించారు.

అంతేకాదు. ముత్తయ్య యిల్లు సోదా చేశారు. ముత్తయ్య యిల్లు చూపులకు చిన్నదేఐనా లోపలమట్టుకు, వెతికినకొద్దీ తవ్వినకొద్దీ రకరకాల ధనరాసులు కనిపించసాగినై. చీపురుముల్లయినా పైకి పోకుండా రాజావారి చోరీఆస్తి అంతా దొరికేసింది. అదంతా భటులు కోటకు చేర్చారు. ఇంకేముంది? ఇంతపని చేసిన




ముత్తయ్యకూ మరిడమ్మకూ ఉరిశిక్ష పడుతుందని ఊళ్ళో పెద్ద గోల బయలుదేరింది. వాళ్ళిద్దరినీ రాజుగారి ఎదటపెట్టారు. వాళ్ళు చేతులు కట్టుకొని నిలబడ్డట్టే నిలబడి, ప్రభువుల పాదాలమీదపడి రక్షించమని ప్రార్థించారు.

నిండుదర్బారులో తిమ్మరాజుగారు ఇలా సెలవిచ్చారు: "ముత్తయ్యా!— జీవితమంతా ధారపోసి ఈ ధనమంతా మీరిద్దరూ కూడబెట్టారు. దీనిని మీరే అనుభవించటం న్యాయం" అంటూ, ఆ ధనరాసులు రెండు మూటలు కట్టించి, దంపతులిద్దరి తలలమీదా చెరివకటీ పెట్టించారు.





బోధపడింది తిమ్మరాజుగారి తత్వం. తక్షణమే, దాచబెట్టిన ధనమంతా బయటికి తీశాడు. బంధువర్గంనుండి గుంజుకొన్న బహుమాన ధనమంతా భార్యచేత మళ్ళీ పంపించివేశాడు. ఊరిలో పోగుచేసిన ద్రవ్యమంతా ఎవరిచ్చింది వారికి లెక్క తప్పకుండా ఇప్పించివేశాడు. కోటలోనుండి కాజేసిన రాజద్రవ్యమంతా, కాసుఅయినా తక్కువ లేకుండా చేర్చివేశాడు.

ఇప్పుడు ముత్తయ్య పూర్తిగా మారిపోయాడు. ద్రవ్యమనేది జీవితం సాగించటానికి ఉపయోగించే ఒక సాధనం. అంతే కాని, ధనం సంపాయించటంకోసమే మనం పుట్టలేదు-అనే దివ్యసూత్రం అతని మనస్సుకు బాగా పట్టింది.

'అయ్యో! జీవితమెంత వృథాచేసుకొన్నాను? అంతూ పొంతూ లేని ఆశతో ధనద్రవ్యాలు పోగుచేయటం మొదలెట్టాను. పోగేసినకొదీ ఆశ ఎక్కువయిందే కాని, కొంచెమైనా తగ్గలేదు. మనస్సుకు తృప్తి అనేది కనుచూపుమేరలోనైనా కనిపించలేదు. దిక్కుమాలిన ఈ ఆశను అర్థంలేని ఈ ఆశను తీర్చుదామనే కాంక్షతో నా భార్యను పురికొల్పి, ఆమె బుద్ధికూడా పాడుచేశాను. అడ్డమైనవాళ్ల కాళ్ళూ

ఈ తీర్పువిన్న ప్రజలకు ఇదేమీ అంతు పట్టలేదు. "ఏమితెలివయ్యా తిమ్మరాజు గారి తెలివి!" అంటూ చెప్పకోసాగారు.

మరునాడు డబ్బుపట్టుకొని ముత్తయ్య బియ్యంకోసం బజారుకు వెళ్లాడు. ఎవరిని ఏ వస్తువుఅడిగినా 'లేదు' అంటూవచ్చారు. ఎన్ని దుకాణాలు తిరిగినా అందరూ ఇదే మాట. దినుసు దొరకలేదు. కోరిన ధన మిస్తానన్నా దొరకలేదు. చేసేదేమిటి?, చేరువనున్న గ్రామాలకు పోయి చూచాడు. అక్కడా ఇదే తంతు!

అయోమయమైపోయింది పాపం, ముత్తయ్య జీవితం! కళ్లు తెరిచాడు. అప్పుడు



పట్టాము. నానా గడ్డీ కరిచాము. ప్రభువుల ధర్మమా అని, ధనంయొక్క విలువా ప్రయోజనమూ ఇప్పుడుకదా నాకు తెలిసి వచ్చింది.

'ఇక—నా స్వలాభంకోసమని ఊరిమీద పడను. ఎవ్వరినీ బాధించను. జానెడు పొట్టకు ఎంత కావాలె? దయామయులైన ప్రభువులు మాకు సరిపడా అనుగ్రహిస్తూనే వున్నారు. దానితో తృప్తిచెందక, ఎందుకీ తాపత్రయం?—అర్థంలేని తాపత్రయం?'

—ఈవిధంగా తనలో తను అనుకొని, తన కుటీరంలో, నిశ్చింతగా కూర్చున్నాడు.

'పోగుచేయట'మనే దురలవాటు మానుకోగానే ముత్తయ్యకు ధనంమీది మమకారం తొలగిపోయింది. తొలగిపోగానే, మనస్సు తేలికపడింది. ఇలా తేలికపడిన మనస్సుతో ఒకవిధమైన కొత్త ఆనందంలో వున్నాడు, ముత్తయ్య.

అంతలోనే రాజభటులు వచ్చారు. ఐతే, ఈసారి ఆ దంపతులను బంధించటానికి కాదు వాళ్లురావటం. దివ్యమైనటువంటి భోజనపదార్థాలు పట్టుకవచ్చారు. ఇది చూచి, ముత్తయ్యదంపతుల సంతోషానికి మేరలేకపోయింది.

నాటినుంచీ ముత్తయ్యా మరిడమ్మా వంటచేసుకోవటం అవసరమే లేకపోయింది. ఏమీ?—రోజూ రెండుపూటలా వారికి కోటలో నుండి భోజనం వస్తూనేవుండె! నెలా తిరిగే సరికి ముత్తయ్యకు అతని జీతమూ చేరుతూవుండె. ఇంక లోటేమిటి?

ఇప్పుడు ధనం పోగుచేయవలసిన పని లేదు కనుక, ముత్తయ్యా మరిడమ్మా ప్రభువులకోసమే అహర్నిశలు పాటుపడుతూ, కృతజ్ఞులై, తృప్తాత్ములై సుఖంగా ఉంటున్నారు. ముత్తయ్యలోని మార్పు ప్రభువుకూ ప్రజకూ కూడా సంతోషాన్ని కలిగించింది.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1953 డిసెంబరునెల సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ అక్టోబర్ 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ ఒకపోస్టుకార్డుపైనవ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## నవంబరునెల చందమామలో

ప్రచురింపబడే ఫోటోలకుగాను, ఈ దిగువ ఉత్తమవ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది

మొదటి ఫోటో : లంగరు దింపు | రెండవ ఫోటో : ఓడను పంపు

పంపినవారు : టి. దైవాధీనం, P. O. శంకరంపేట, (via) నర్సింగి, హైద్రాబాద్ (దక్కన్)

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపినవారి పేరుతోసహా నవంబర్‌నెలలో ప్రచురిస్తాము. బహుమతిమొత్తం రూ. 10/- నవంబరుసంచిక వెలువడినవెంటనే పంపబడుతుంది.

# అవ్వయ్యార్

అవ్వయ్యార్ గొప్ప తమిళ కవయిత్రి. తెలుగు పిల్లలు వేమనపద్యాలు చదువుకున్నట్లే తమిళ బాలబాలికలు అవ్వయ్యార్‌పద్యాలు చదువుకుంటారు. పిల్లలకోసం ఆమె ప్రత్యేకంగా అనేక పద్యాలు రాసింది.

తమిళదేశంలో అవ్వయ్యార్ కథను అతి విచిత్రంగా చెప్పుకుంటారు. తల్లిగర్భంనుండి బయటపడగానే ఆమెను తల్లిదండ్రులు అడవిలో ఒకతట్టలో వదలిపెట్టిపోయారు. తరువాత పెద్ద వాన వచ్చి ఆ తట్ట వాననీటికి తేలిపోయి నదిలో ప్రవేశించి ప్రవాహంలో కొట్టుకుపోతూవుండగా, ఉదయంవేళ నదిలో స్నానంచేయవచ్చిన ఒక మనిషి ఆ పిల్లను చూసి తీసుకుని ఇంటికి వెళ్లాడు. తొట్టిలో ఉండగానే ఈ పిల్ల వినాయకుడి విగ్రహంకోసం ఏడ్చి పోరుపెట్టింది. బిడ్డకు ఈడు మించిన తెలివితేటలుండటం చూసి "అవ్వ" అని పేరుపెట్టారు.

అవ్వ నిత్యమూ వినాయకుణ్ణి ఆరాధిస్తూ పెరిగి పెద్దదయింది. యుక్తవయస్సు రాగానే ఆమెను పెంచిన తలిదండ్రులు ఆమెకు మనువు కుదిర్చి పెళ్ళికూతురు చేశారు. కాని అవ్వకు సంసార తాపత్రయంలో చిక్కుకోవాలని లేదు. ఆమె తన ఇష్టదైవమైన వినాయకుణ్ణి ప్రార్థించి ఆయన అనుగ్రహంతో ముసలిదయిపోయింది. అది మొదలు ఆమె అవ్వయ్యార్ అని పిలువబడుతూ, కాలినడకను దేశమంతటా తిరిగి ప్రజలకు నీతిబోధలు చేయసాగింది. ఆమెకీర్తి దేశమంతటా వ్యాపించింది. ఆమె బోధలు వినటానికి జనం తండోపతండాలుగా వచ్చేవారు.



అవ్వయ్యార్ కీర్తి విని చోళరాజు ఆమెకు బ్రహ్మాండమైన స్వాగతం ఏర్పాటుచేసి, ఆమెను తన ఆస్థానంలో ఉండిపొమ్మని అర్థించాడు. కాని అవ్వయ్యార్ సమ్మతించలేదు. తన జీవితం పేదప్రజల సేవలోనే వెళ్ళిపోవాలని చెప్పి ఆమె తనదారిన తాను వెళ్ళింది.

ఒకప్పుడు ఒకరాజ్యంలో క్షామం వచ్చింది. ప్రజలు తిండికి లేక మలమల మాడుతున్నారు. ఇది చూసి ఒక కామందు తనదగ్గిర ఉన్న ధాన్యమంతా పేదప్రజకు పంచసాగాడు. న్యాయంగా ఈ ధాన్యం రాజుగారికి చెల్లించవలసిన ధాన్యం. ఇకనేం? రాజభటులు ఈ భూస్వామిని పట్టుకుపోయి రాజు ఎదుట ఉంచారు. ఆతనిని విడిపించాలని ప్రజలు అలజడి చేయసాగారు. ఆ సమయాన అవ్వయ్యార్ అక్కడికి పోయి, రాజును మందలించి, భూస్వామిని విడిపించి, ఆ రాజ్యంలో వాన కురిపించింది.



ఒక గ్రామంలో ఒక ఆసామీ ఉండేవాడు. అతని భార్య గయ్యాళి. ఈ గయ్యాళికి బుద్ధి చెప్పాలనే ఉద్దేశంతో అవ్వయ్యార్ ఒకనాడు ఈ ఆసామి ఇంటికి భోజనానికి వెళ్ళింది. వడ్డించేటప్పుడు గయ్యాళి ఇల్లాలు భర్తపట్ల చాలానిర్లక్ష్యం చూపింది. "అదుపులేని భార్యతో కాపరం చెయ్యటంకన్న సన్యాసం పుచ్చుకోవటం మేలు" అని అవ్వయ్యార్ భర్తకు హితబోధ చేసి విస్తరి ముట్టకుండానే లేచిపోయింది. భర్తకు పౌరుషం వచ్చి దండకమండలాలతో ఇల్లు వదిలాడు. గయ్యాళిభార్య అవ్వయ్యార్‌ను వెతుక్కుంటూ పోయి ఆమె కాళ్ళమీద పడి పతిభిక్ష వేడింది. ఆడది భర్తను ప్రేమతో కట్టేసుకోవాలని హితం చెప్పి అవ్వయ్యార్ ఆమెను పంపేసింది.

ఇంకొక గ్రామంలో పరమలోభి ఒకడుండేవాడు. వాడు పిల్లికి బిచ్చంపెట్టేవాడుకాడు. ఎవరికైనా సొమ్ము ఇవ్వవలసి వస్తే "రేపు రా" అంటూ ఉండేవాడు. ఒకనాడు అవ్వయ్యార్ ఈ లోభిని చూడబోయింది. అతడు అవ్వయ్యార్ కవిత్వంవిని, "ఆహా, అక్షరలక్షలుచేసే కవిత్వం, మీకు అంబారీ ఏనుగునిస్తాను. రేపు రండి," అన్నాడు. మర్నాడు అవ్వయ్యార్ వచ్చేసరికి తనకు కడుపునొప్పి వచ్చినట్టు మూలగసాగాడు. ఇంకొకసారి వస్తానని అవ్వయ్యార్ వెనక్కు తిరిగింది. కాని లోభికి నిజంగానే కడుపునొప్పి పట్టుకుంది. చివరకా పిసినిగొట్టు అవ్వయ్యార్ కాళ్ళుపట్టుకుని, క్షమాపణ చెప్పుకుని, కడుపునొప్పి పోగొట్టుకున్నాడు.





పారీ అనే రాజొకడుండేవాడు. అతనికిద్దరు కుమార్తెలు. వారిని దైవికుడనేవాడికిచ్చి వివాహం చేదామనుకొంటూవుండగా, చేర చోళ పాండ్య రాజులు దుర్మార్గం తలపెట్టి పారీని చంపి, దైవికుణ్ణి ఒక కోటలో బంధించారు. పారీ కుమార్తెలు అరణ్యవాసంలో బాధలు పడుతూవుండగా అవ్వయ్యార్ వారిని కలుసుకొని వారి వృత్తాంతం విన్నది. వెంటనే ఆమె తన ఇష్టదైవమైన వినాయకుణ్ణి ప్రార్థించింది. మరుక్షణమే వేలకొద్దీ ఏనుగులు బయలుదేరి దైవికుడు బంధింపబడివున్న కోటను కూలదోసి దైవికుణ్ణి తెచ్చి అవ్వయ్యార్‌కు వప్పగించాయి. అవ్వయ్యార్, పారీ కుమార్తెలకు వివాహం జరిపించసాగింది. ఇది తెలిసి దుర్మార్గులైన చేర చోళ పాండ్య రాజులు వివాహం భగ్నము చెయ్యటానికి తమ బలాలతో బయల్దేరారు. ఇది తెలిసి అవ్వయ్యార్ భూదేవితో, "తల్లీ, ఈ అధర్మం ఎంత కాలం భరిస్తావు. నోరు తెరు," అని వేడింది. వెంటనే శత్రుబలాలు వచ్చేదారికి అడ్డంగా భూమి విచ్చి పెద్ద అగాధంఏర్పడింది. యుద్ధానికని బయల్దేరిన రాజులు బుద్ధి తెచ్చుకుని వివాహానికి అథితులుగా వచ్చారు.

అవ్వయ్యార్ కాలంలోనే తిరువళ్ళువర్ అనే మరొక కవి వుండేవాడు. ఈయన ప్రజల బాషలో "కురళ్" అనే గొప్ప గ్రందాన్ని రచించాడు. అయితే ఈ గ్రంథాన్ని మధురలోని తమిళసంఘం వారు ఆక్షేపించారు. ఈ వార్త విని అవ్వయ్యార్ మధురకు వెళ్ళింది. "కురళ్" గ్రంథాన్ని ఒక కోనేట్లో పడవేసింది. వెంటనే కోనేటి అడుగునుంచి ఒక పీటా, దానిమీద పద్మమూ పైకివచ్చాయి. కురళ్ గ్రంథాన్ని ఈ పద్మంమీద వుంచి భగవంతుడే ఒడ్డుకు చేర్చాడు. ఈవిధంగా తమిళ



సంఘంవారి అహంకారానికి తగిన శాస్తి జరిగింది. కుఱళ్ గొప్ప గ్రంథమని రుజువయింది.

ఈవిధంగా ప్రజలకు మంచిమార్గం ఉపదేశిస్తూ, దేశమంతటా సంచారంచేస్తూ, ప్రజలందరినీ తన వారినిగా చూసుకుంటూ అవ్వయ్యార్ వృద్ధురాలయింది. ఈ దశలో ఆమె ఒకనాడు ఒక నేరేడు చెట్టుకింద విశ్రాంతి తీసుకుందామని ఎండలో నడచి వచ్చింది. చెట్టుపైనున్న ఒక గొల్లపిల్లవాడు, "అవ్వా, పళ్ళు తింటావా?" అని అడిగాడు. "కాసిని పడెయ్యి, నాయనా," అన్నది అవ్వయ్యార్. "వేడిపళ్ళు కావాలా, చల్లనిపళ్ళు కావాలా?" అని అడిగాడు కుర్రవాడు. "ఎక్కడైనా వేడిపళ్ళుంటాయా? చల్లనిపళ్ళే పడెయ్యి," అన్నది అవ్వయ్యార్. కుర్రవాడు చెట్టుకొమ్మలు దులిపాడు. నేరేడుపళ్ళు నేలరాలాయి. అవ్వయ్యార్ నేలమీదినుంచి ఒక పండు తీసి దుమ్ముపోవడానికి ఊదసాగింది.



చెట్టుమీదినుంచి కుర్రాడు పకపకా నవ్వాడు. "ఎంత పిచ్చిదానివి, అవ్వా? ఎక్కడన్నా వేడిపళ్ళుంటాయా? ఎందుకలా ఊదుతున్నావ్?" అన్నాడు.

అన్నీ తెలిసిన తననే వేళాకోళంచేసిన ఈ కుర్రవాడు సామాన్యుడు కాదని అవ్వయ్యార్ అతనికి నమస్కారంచేసి, "ఎవరు, నాయనా, నువ్వు?" అన్నది.

వెంటనే కుర్రవాడు కుమారస్వామిగా మారాడు. "అవ్వా, నువ్వు అవతరించిన పని అయిపోయింది. ఇక నీవు కైలాసానికి వెళ్ళు" అని ఆదేశించాడు కుమారస్వామి.

అవ్వయ్యార్ తన నీతిబోధనను ప్రజలకు వదలి తాను కైలాసం చేరింది. ఆ నీతిబోధల నింకా ఈనాటికీ ప్రజలు జ్ఞాపకం చేసుకుంటూనే ఉన్నారు. ఇదేవిధంగా ఎల్లకాలమూ జ్ఞాపకం చేసుకుంటూనే ఉంటారు.

అతి విచిత్రమైన ఈ అవ్వయ్యార్ కథను జెమినీ వారు ఎన్నో సంవత్సరాలపాటు ప్రయాసపడి, ఎంతో డబ్బు వ్యయంచేసి, ఈ మహత్తరగాథను సినిమా చిత్రంగా తయారుచేశారు.

ఈ చిత్రాన్ని గొప్పగొప్పవాళ్లంతా మెచ్చుకున్నారు. చూడటానికి ఎంతో అద్భుతంగాఉండే ఈ "అవ్వయ్యార్" చిత్రాన్ని ప్రతి స్త్రీ, పిల్లా, పిల్లవాడూ తప్పక చూపితీరాలి.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications Madras 26, Controlling Editor: SRI CHAKRAPANI.

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

మనుజుల గూడు

పంపినవారు :
సి. వి. కొండారెడ్డి - రాయపేట

